# ఏమి విచిత్రం!

అది ఒక ఆహ్లాదకరమైన సాయంత్రం. సోనూ బడినుండి ఇంటికివస్తున్నాడు హటాత్తుగా అక్కడ ఒక గాలిదుమారం లేచింది. ఎగిరే-ప్లేటులాంటి విచిత్రమైన వస్తువు క్రిందికి దిగుతూ తిన్నగా సోనూ ముందుకు వచ్చి ఆగింది

దానిలో నుండి చాలాపొట్టి మనిషి ఒకడు బయటికి వచ్చి సోనూతో అన్నాడు...

"నీవు నాతో స్నేహం చేస్తావా?"

"మ...మ.. మరి నీవెవరు?"

"నీతో స్నేహం చేయాలని అంగారక గ్రహం నుండి వచ్చాను."

సోనూ అనుకోకుండానే, ఒప్పేసుకున్నాడు.

"సరే అలాగే"

"సరే, మనస్నేహానికి గుర్తుగా ఇది తీసుకో! నా మనసుకి ఎంతో ఇష్టమైన వస్తువు ఇది మీ భూమి మీద ఒక విచిత్రం."

"విచిత్రమా?"

"నిజంగా. తొక్క లేదు టెంక లేదు. మామిడిపండు యొక్క అసలైన మజా."

"మామిడిపండా? సీతాకాలంలోనా? హాయ్, తొందరగా ఇయ్యి"

"అలాగే మిత్రమా నీ నోరు బాగా తెరు, కళ్ళు గట్టిగా మూసుకో, మరి ఇదిగో తిను నాప్రియమైన మేంగో బైట్!"

"ఆం! మేంగో బైట్!"

సోనూ సంతోషంతో తబ్బిబ్బైపోయాడు. వాడి ఫేవరేట్ మేంగో బైట్ అంగారక గ్రహంలో కూడా ఫేవరేటే!





సోనూ మేంగో బైట్ వాడి నోట్లో వేసుకొన్న వెంటనే, వాడి కొత్త మిత్రుడు మేంగో బైట్లతో నిండిఉన్న ఒక పెట్టె ఇచ్చి "మళ్ళీ వస్తా!" అంటూ పైకి ఎగిరి పోయాడు.







చందమామ విజయా కంబైన్స్
భైరవ ద్వీపం
నిర్మాత
బి.వెంకట్రామరెడ్డి
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం సింగీతం శ్రీనివాసరావు



# చందమామ

ఏప్రిల్ 1994



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : **4.00**

సంవత్సర చందా : **48.00**

ఇప్పుడు మార్కెట్లో వున్న
ఉగాది విశేష సంచిక నుంచి

# వనిత

ఎక్కువ పేజీలతో, కొత్త గెటప్‌తో, వైవిధ్యమైన అంశాలతో,
పాఠకులకు విలువైన బహుమతులు గల పోటీలతో
వెలువడుతున్నది!

**ప్రతి సంచికా ఒక ప్రత్యేక సంచికే!**

ఇలా తెలుగు పత్రికా ప్రపంచంలో ప్రతి సంచికా
ఒక విశేష సంచికగా వెలువడుతున్న ఏకైక పత్రిక

# వనిత

అన్నది మీరీపాటికి గమనించే వుంటారు!
ఉగాది (ఏప్రిల్'94) విశేష సంచిక ప్రత్యేకం :
**ప్రసిద్ధ రచయిత్రుల తొలికథలు!**
నేడే కొని చదవండి!!

## వనిత

ఒక సంపూర్ణమైన కుటుంబ పత్రిక

# వనిత

ఇప్పుడు పెరిగిన ధర
**రూ. 5/- మాత్రమే!**
అవును. నిజం. వనిత లో పెరిగిన
పేజీలతో పోల్చి చూస్తే పెరిగిన ధర
అతి స్వల్పం - అని మీరే అంగీకరిస్తారు.
ఎలాగంటారా?
**చందాదారులుగా చేరడమే!**
వనిత న్యూస్‌స్టాండ్ ధర ఇకపై రూ. 8/-
అంటే ఏడాదికి 96 రూపాయలు.
కానీ చందాదారులుగా చేరితే
మీరు చెల్లించవలసింది
**రూ. 77/- మాత్రమే!**
అంటే దాదాపు ఇరవై శాతం ఆదా
అవుతుంది మీకు. మునుపటి వార్షిక
చందా రూ. 72/-తో పోలిస్తే కేవలం
ఐదు రూపాయలు మాత్రమే ధరలో
పెరుగుదల. కానీ పుటలో.....
40 పేజీలు పెరుగుదల!
అందుచేత వెంటనే ఈ క్రింది కూపన్
నింపి చందాదారులు కండి!
**ఈ సదుపాయం మే 15, 1994**
వరకు మాత్రమే!

నేను వనిత చందాదారుగా చేరడానికి రూ. 77/- డి.డి./ఎం.ఓ. (చెక్కు [illegible]) ద్వారా పంపుతున్నాను.
సంతకం ________
పేరు: ________
చిరునామా: ________

చందాలు పంపవలసిన చిరునామా :
డాల్టన్ ఏజెన్సీస్,
చందమామ బిల్డింగ్స్,
188, ఎన్.ఎస్.కె. శాలై,
వడపళని, మద్రాసు - 600 026.

మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకుపైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, ఇటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న

ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర




ఇది ఒక డాల్టన్ ప్రచురణ




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి

## అందరికీ విద్య!

ఈ సంచిక వెలువడే నాటికి రాష్ట్ర ముఖ్యమంత్రులు ఢిల్లీలో సమావేశమై, తొమ్మిది దేశాల ప్రతినిధుల సమావేశం చేసిన నిర్ణయాలను ఎలా అమలుపరచాలా అని ఆలోచనలు జరుపుతూ ఉంటారు.

గత డిసెంబర్ నెలలో — బంగ్లాదేశ్, బ్రెజిల్, చైనా, ఈజిప్టు, ఇండోనేషియా, మెక్సికో, నైజీరియా, పాకిస్తాన్, ఇండియా ప్రతినిధులు ఢిల్లీలో సమావేశమై, 'అందరికీ విద్య' అనే అంశం గురించి సుదీర్ఘమైన చర్చలు జరిపి, కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. ఈ శతాబ్దాంతానికి పై తొమ్మిది దేశాలలోని బాలబాలికలందరూ విద్యావంతులు కావాలన్న ఉదాత్త ఆశయం పట్ల ఎవరికీ ఎటువంటి భేదాభిప్రాయాలూ లేవు. కానీ అందుకు కావలసిన ఆర్థిక వనరులను ఎలా సమకూర్చుకోవాలన్నదే సమస్య. ఆర్థిక సహాయం కోసం — 'ప్రపంచ బ్యాంకు', 'అంతర్జాతీయ ఆర్థిక నిధి' వంటి ఆర్థిక సంస్థల మీద ఆధారపడవలసి ఉంటుందని అన్ని దేశాలూ అభిప్రాయపడ్డాయి. అయితే, అందుకు ఆ సంస్థలు కొన్ని నిబంధనలు విధించాయి. ఆ నిబంధనలను సడలించాలని ఢిల్లీ సమావేశం ఒక తీర్మానంలో కోరింది.

మన దేశానికి సంబంధించినంతవరకు, ప్రస్తుతం మన ముఖ్యమంత్రులు తీసుకునే నిర్ణయం మీదే మన విద్యారంగం భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది. యేటా కోట్లాది రూపాయలు వ్యయం చేయడమే కాదు; ప్రాథమిక విద్య నేర్చుకోవడానికి బాలబాలికలను పాతశాలలకు ఎలా ఆకర్షించాలన్నది కూడా మన దేశంలో ఒక పెద్ద సమస్యగా ఉంటున్నది!

సంపుటి: 93    ఏప్రిల్'94    సంచిక: 4

విడిప్రతి : 4.00    సంవత్సర చందా : 48.00

# మీ కేశ సంపదకు

జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, చల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.

స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

# రీటా




నేడే ఒక సీసా కొనండి ప్రతిచోటా దొరుకును

84-1

వార్తలు - విశేషాలు :

# రైతులకు రాజకీయ గుర్తింపు!




సుఖశాంతుల కోసం ప్రపంచ ప్రజలు పరస్పరం నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేసుకుంటున్న సమయంలో మెక్సికో రైతులు సాయుధ పోరాటం అరంభించారు. గత ఇరవై సంవత్సరాలలో ఇది చాలా హింసాత్మకమైనదని పరిశీలకులు చెబుతున్నారు.

"మాకు ఏదీ మిగలలేదు. తలదాచుకోవడానికి ఇల్లు లేదు. మాదని చెప్పుకోవడానికి కుంట పొలం లేదు. చేయడానికి పని లేదు. చదువు లేదు. రోగం వస్తే మందులు లేవు. ఆరోగ్యం లేదు. అందువల్ల ప్రభుత్వం మీద తిరుగుబాటు జరపడం తప్ప మరొక మార్గం కనిపించలేదు. ఇది మా అంతిమ పోరాటం," అంటున్నాడు తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న గెరిల్లా నాయకుడు కమాండెంట్ మార్కోస్. 1910వ సం॥లో జరిగిన వ్యావసాయిక విప్లవానికి నాయకత్వం వహించిన, విప్లవ నాయకుడు ఎమిలియాన్ జపాటా నుంచి ప్రేరణ పొంది 'జపాటిస్టా నేషనల్ లిబరేషన్ ఆర్మీ'ని స్థాపించినట్టు కమాండెంట్ మార్కోస్ చెబుతున్నాడు.

దక్షిణ మెక్సికోలోని ఛియాపాస్, అధిక సంఖ్యాకులైన పేద రైతులు నివసిస్తూన్న చాలా వెనుకబడిన ప్రాంతం. పాలకపక్షమైన 'ఇన్‌స్టిట్యూషనల్ రెవల్యూషనరీ పార్టీ' నిరంకుశ అధికారానికి లోనై అక్కడి ప్రజలు ఎన్నో కష్టనష్టాలను అనుభవించారు. ఇటీవలి కాలంలో అక్కడి ప్రభుత్వం ధనికులయిన ఎస్టేట్ యజమానులతో చేతులు కలిపింది. ఈ కాఫీ ఎస్టేట్ యజమానులు, అటవిక శాఖ అధికారుల సహాయంతో కుట్ర పన్ని రైతుల పొలాలన్నిటినీ కాజేశారు. రైతుల పంటకు సరైన ధరలు చెల్లించేవారు కాదు. ఎదురుతిరిగిన రైతులను హతమార్చసాగారు. అధికార బలంతో ఒక్కసారిగా వేలాది ఎకరాల పొలాలను ఆక్రమించుకోవడం కూడా జరిగింది. ఎదురు తిరిగిన

వాళ్ళను జైళ్ళకు పంపి, ధనికుల కొమ్ము కాశారు ప్రభుత్వ అధికారులు. ఆవిధంగా, పేదలైన రైతులకు కలిసికట్టుగా తిరుగుబాటు చేయడం తప్ప మరొక మార్గం లేని పరిస్థితి ఏర్పడింది.

ఆఖరికి జనవరి ఒకటవ తేదీ అమెరికా, కెనడా, మెక్సికోల మధ్య ఏర్పడిన నాఫ్టా (నార్త్ అమెరికన్ ఫ్రీట్రేడ్ అగ్రిమెంట్) ఒప్పందం, తిరుగుబాటుకు పురికొల్పింది. ఆ ఒప్పందంతో అమెరికాలో నిలువ వున్న నాశిరకం వస్తువులు, ఆహార ధాన్యాలు తమదేశానికి వచ్చి పడగలవని రైతులు భయపడ్డారు. దాని ఫలితంగా తిరుగుబాటు జరిగింది.

దాదాపు రెండువేల మంది రైతు గెరిల్లాలు, సాన్ క్రిస్టబాల్, డెలాస్ కాసస్, ఒకాసింగో, మార్గరిట్టాస్, అల్టా మారినో మొదలైన కొండ ప్రాంత పట్టణాలను మూడు రోజుల పాటు వశపరచుకున్నారు. 300 మంది గెరిల్లాలు క్రిస్టబాల్ మున్సిపల్ కార్యాలయాన్ని ముట్టడించి అక్కడి ఫైళ్ళనూ, కంప్యూటర్లనూ, బల్లలనూ కుర్చీలనూ నాశనం చేశారు. మరికొన్ని చోట్ల ప్రభుత్వ కార్యాలయాలూ, భవనాలూ రైతుల ఆగ్రహానికి ఆహుతయ్యాయి. జైళ్ళ నుంచి 180 మంది గెరిల్లాలను విడిపించుకున్నారు.

మెక్సికన్ సైన్యం, ఒక్కసారిగా ఆకాశం నుంచీ, భూమార్గం నుంచీ గెరిల్లాలను చుట్టుముట్టి, ఒకవారంలోగా వాళ్ళను అడవులలోకి తరిమికొట్టింది. దాదాపు 200 మంది గెరిల్లాలు కాల్పులలో ప్రాణాలు కోల్పోయారు. గెరిల్లాల ప్రతీకారచర్యకు భయపడి వేలాది మంది ప్రజలు ఆయా పట్టణాలు వదిలి పారిపోయారు.

ఈ తిరుగుబాటుకు కారణం — రోమన్ కేథలిక్ బిషప్ శామ్యూల్ రూయిస్ అని ప్రభుత్వం నిందారోపణ చేసింది. కాని బిషప్ దానిని నిరాకరించారు. అయితే, ప్రభుత్వం పేద రైతుల పట్ల చూపుతున్న వైఖరిని మార్చుకోవాలని, బిషప్ హెచ్చరించారు. రైతులకు తమ దేశంలో జీవించే హక్కును లేకుండా చేసే అధికారం ప్రభుత్వానికి లేదని ఆయన స్పష్టం చేశారు.

డెబ్బై ఏళ్ళుగా పరిపాలనలో వున్న అధికార పక్షం, రైతుల సమస్యలను ఉదాసీనం చేయడానికి సాధ్యం కాదని ఇప్పుడు గ్రహించింది. గెరిల్లాలను అణచివేయడానికి తీసుకున్న చర్యలను ఆపివేసింది. 'జపాటిస్టా ఆర్మీ'ని ఒక రాజకీయ శక్తిగా అంగీకరిస్తూ దానితో సంప్రదింపులు జరపడానికి తన సంసిద్ధతను తెలియజేసింది. వచ్చే ఆగస్టులో జరగనున్న సాధారణ ఎన్నికలలో బహుముఖ పోటీలు ఉండవచ్చని పరిశీలకులు భావిస్తున్నారు.

మెక్సికో - కొన్ని చారిత్రక విశేషాలు:

- ప్రపంచంలో అత్యధికంగా స్పానిష్ భాష మాట్లాడే దేశం.
- 16వ శతాబ్దం వరకు మాయాఇండియన్ రాజ్యాలు ఉండేవి.
- 1520 - 1820 మధ్య స్పెయిన్ దేశపు పాలిత ప్రాంతం అయింది.
- 1821వ సం॥లో స్పెయిన్ నుంచి స్వతంత్రం పొందింది.
- 1846 - 48 అమెరికాతో యుద్ధం.
- 1848 మాయా ఇండియన్ తిరుగుబాటు అణచివేత.
- 1910 - జపాటా నాయకత్వంలో రైతుల తిరుగుబాటు.
- 1917 - నూతన రాజ్యాంగంతో ఆధునిక శకారంభం.
- 1920 - ఇన్స్టిట్యూషనల్ రెవల్యూషనరీ పార్టీ అధికారం.




# పేర్ల అమ్మకం

విజయపురి సంతలో ఒక ముసలివాడు, ఒక మూలగా కూర్చుని, "పేర్లు అమ్ముతాను కొనండి, బాబూ! విలువైన పేర్లు, వెలగట్ట లేని పేర్లు!" అని అదేపనిగా బిగ్గరగా అరుస్తూ అక్కడి జనం దృష్టిని ఆకర్షించ సాగాడు.

ఆ ముసలివాడి పేరు పోతురాజు. వాడికొక రోగిష్టి పెళ్ళామూ, పెళ్ళీడుకొచ్చిన కూతురూ వున్నారు. వాడు వయసులో వుండగా రాజుగారి సైన్యంలో వుంటూ, ఒకానొక యుద్ధంలో కాలు పోగొట్టుకుని అవిటివాడు కావడమే గాక, రాజుగారి నిరాదరణక్కూడా గురైన దురదృష్ట వంతుడు.

పోతురాజుపిచ్చివాడనుకునిసంతలోజనం ఎవ్వరూ వాడి పేర్ల అమ్మకాన్ని గురించి పట్టించుకోలేదు. కానీ, అవకాశం కోసం చూస్తూ, జనంలో తారట్లాడుతున్న జోగులు అనే చిల్లర దొంగ మాత్రం సంగతేమిటో తెలుసుకోవాలని, పోతురాజును సమీపించి, "ఒరే, ముసలాడా! లోకంలో ఎక్కడైనా డబ్బిచ్చి పేర్లు కొనే పిచ్చివాళ్ళుంటారా?" అన్నాడు.

"నిజమే! మామూలు పేర్లయితే కొనరుగానీ, నేనమ్మేవి లక్షల విలువ చేసేవని తెలిస్తే ఎవరు మాత్రం కొనరు?" అన్నాడు పోతురాజు.

"అలా అయితే, నీ పేర్ల గొప్పదనమేమిటో చెప్పు, చూతాం!" అని అడిగాడు ఆసక్తిగా జోగులు.

"తేరగా చెప్పే పేర్లు కావవి. ఒక్కొక్క పేరుకూ పాతిక వేల వరహాలు ముందుగా చెల్లిస్తేనే చెపుతాను!" అన్నాడు పోతురాజు.

జోగులు నవ్వి, "నీ పేర్లు అంత విలువైనవో కావో తెలుసుకోకుండా అంత ధనం నీకెవడి స్తాడు? నీకు నా మీద నమ్మకముంటే, ఒక పేరు చెప్పు. దాంతో లాభం వస్తే, వచ్చే సంత రోజు వచ్చి, నువ్వడిగిన ధనమిస్తా!" అన్నాడు.

పోతురాజు, జోగుల్ని క్షణ కాలం పాటు పరిశీలనగాచూసి, "నీ మీద నమ్మకంతో ఒక

మల్లవరపు మనోహరరెడ్డి



పేరు చెపుతాను. నిజాయితీగా నా డబ్బు నాకిస్తే, నా దగ్గిరున్న రెండో పేరు కూడా నీదే!" అని ఇలా చెప్పాడు:

"కొన్ని సంవత్సరాల క్రితం విజయపురి సరిహద్దు గ్రామాల్లో చిరుతపులి ఒకటి విజృంభించి గ్రామస్థుల్నీ, వాళ్ళ పశు సంపదనూ ధ్వంసం చేయసాగింది. రాజు దాన్ని చంపించడానికి ఎన్నో విధాల ప్రయత్నించి విఫలుడై, చివరకు పులిని చంపిన వారికి లక్ష వరహాల బహుమతిని ప్రకటించాడు. ఇది జరిగిన కొన్ని దినాలకు, ఒక గ్రామ పొలిమేరల్లో చంపబడ్డ పులి కళేబరం కనిపించింది కానీ, దాన్ని చంపిన వారెవరో తెలియ రాలేదు. ప్రకటించిన బహుమతి అందజేయడం కోసం రాజు వేగుల్ని పంపి వెతికించాడు. పులిని చంపిన వాడిపేరు చక్రధరుడని తెలిసిందిగాని, ఇప్పటి వరకూ అతడి జాడలేదు. నువ్వు పేరుకు తగ్గట్టు వేషం మార్చుకుని, రాజు గారిని కలిస్తే ఆ బహుమతి నీకు దక్కుతుంది!"

వెంటనే జోగులువేషం మార్చుకుని, రాజు నుదర్శించి, తన పేరు చక్రధరుడని, కొంత కాలం క్రితం పులిని చంపింది తనేననీ చెప్పాడు.

ఇది విన్న రాజు అనుమానంగా, "మరైతే బహుమతి కోసం ఇంత కాలానికి వచ్చావేం? ధనమంటే నీకు చేదా?" అని అడిగాడు.

"లేదు, ప్రభూ! వృద్ధులైన నా తల్లిదండ్రులను కాలినడకన కాశీయాత్ర చేయించవలసి వచ్చింది. అందువల్లనే ఇంతకాలం గడిచి పోయింది," అన్నాడు వినయంగా జోగులు.

రాజు, జోగుల్ని సన్మానించి, లక్షవరహాలు ఇచ్చాడు. ధనం చేతికి రాగానే జోగులుకు, పోతురాజుకు చిల్లిగవ్వ కూడా ఇవ్వకుండా, ఆ రెండో పేరు కూడా కాజేయాలన్న దురాలోచన కలిగింది.

వాడు మరొక సంతరోజున పోతురాజును కలిసి, "నువ్వ చెప్పింది నిజమే! ఆ రెండో పేరు కూడా చెబితే, పాతికా పరకా ఎందుకూ, వచ్చింది చెరిసగం పంచుకుందాం," అన్నాడు.

"నువ్విస్తానన్న డబ్బుతో ముసలిదానికి వైద్యమూ, నా బిడ్డకు పెళ్ళీ చేయాలి. నీ మాటలు నమ్మి మోసపోతే, నా కూతురి

బతుకు ఏ నుయ్యో గొయ్యో అవుతుంది," అన్నాడు పోతురాజు.

"భలేవాడివే! ఇంత సాయం చేస్తున్నావు. అలాంటప్పుడు నీ బిడ్డ, నా బిడ్డ కాదా ఏమిటి!" అంటూ నమ్మబలికాడు జోగులు.

అప్పుడు పోతురాజు ఇలా చెప్పాడు:

పూర్వం ఐదు తరాలకు ముందు హిమాలయాల నుంచి మహాపాత్రుడనే మహాముని వచ్చి, అప్పటి విజయపురి రాజును కలిసి, ఏడు తరాల వరకూ రాజ్యమూ, రాజులూ, ప్రజలూ సుభిక్షంగా వుంటారని ఆశీర్వదించి వెళ్ళాడట! ఆయన వెళుతూ వెళుతూ, మళ్ళీ ఐదు తరాల తర్వాత తనేవచ్చి విజయపురి రాజును కలుస్తానని మాట ఇచ్చాడట! ఆ మహాపాత్రుడి ఆశీస్సుల వల్లనే విజయపురి సుభిక్షంగా వుందనీ, మళ్ళీ ఆ మహాముని తన తరంలోనే వచ్చి తన రాజ్యాన్ని పావనం చేస్తాడనీ, మన మూర్ఖమహారాజు ఎదురు తెన్నులు చూస్తున్నాడు. నువ్వు తగిన వేషంలో వెళ్ళి రాజును దర్శిస్తే, అంతులేని కానుకలు లభిస్తాయి!"

వెంటనే జోగులు బయలుదేరి తెల్లటి ముగ్గుబుట్ట లాంటి తలతో, ఒంటి నిండా విభూది రేఖలూ, రుద్రాక్షలూ ధరించి రాజును కలిసి, తను హిమాలయాల నుంచి వస్తున్న మహాపాత్రుడినని చెప్పుకున్నాడు.

రాజు పరమానందం చెంది, వారం రోజుల పాటు రాజ్యమంతటా ఘనంగా వేడుకలు జరిపించి, జోగులుకు విలువైన కానుక లెన్నో సమర్పించుకుని సాగనంపాడు.





పోతురాజు నవ్వి, "నువ్వు చేసిన మోసం కన్నా నేను చేసింది ఎక్కువేం కాదులే!" అన్నాడు.

"అయితే, ఈసారి కూడా ఒక పేరు చెప్పు. దేవుడి మీద ఒట్టు, మోసం చెయ్యను!" అన్నాడు జోగులు.

"బుద్ధుంటే నీకు పేరమ్ముతానా?" అన్నాడు పోతురాజు కోపం నటిస్తూ.

"సరే, నీ నమ్మకం కోసం ఒక పనిచెయ్యి. ముందు పేరేమిటో చెప్పు. తర్వాత నాతో వచ్చి, రాజు గారిచ్చే బహుమతి నువ్వే తీసుకో!" అన్నాడు జోగులు, పోతురాజును మళ్ళీ ఎలాగైనా మోసగించవచ్చునుకుంటూ.

ఇందుకు పోతురాజు సరేనని, "రాజు గారితో, నీ పేరు బలభద్రుడని చెప్పు! ఇందుకు నువ్వు వేషం మార్చవలసిన అవసరంకూడా లేదు. ఎందుచేతనంటే, ఆ బలభద్రుణ్ణి గురించి రాజుగారు విన్నాడే తప్ప చూసి వుండలేదు. మహాపరాక్రమవంతుడైన అతడి పేరు వింటేనే, రాజుగారికి హడలు. నీతో స్నేహం కోసం ఆయన నీకు గొప్ప సన్మానం చేస్తాడు," అని చెప్పాడు.

జోగులు నిండు సభలో రాజును కలిసి, "రాజా! నేను మహా పరాక్రమవంతుడైన బలభద్రుణ్ణి!" అన్నాడు.

రాజు ఒక్కక్షణం నిశ్చేష్టుడై, పక్కనే వున్న మంత్రితో చిన్నగా, "మన యుద్ధ తంత్రాలూ, సైనిక రహస్యాలూ శత్రువులకు చేరవేశాడని,

ఆ కానుకల డబ్బుతో జోగులు నగరంలో ఒక అందమైన మేడ కొని, పోతురాజు సంగతి గాలికి వదిలి, విలాసంగా జీవించసాగాడు.

కొన్ని దినాలు గడిచాక, ఒక రోజు జోగులుకు పోతురాజును గురించి తెలుసుకోవాలనిపించింది. వాడు సంతకు బయలుదేరాడు.

ఎప్పటి నుంచో వాడికోసమే కాచుకు కూర్చున్న పోతురాజు, జోగుల్ని చూసికూడా చూడనట్టు నటిస్తూ, "పేర్లు అమ్ముతాను కొనండి, బాబూ! విలువైన పేర్లు, వెలగట్టలేని పేర్లు!" అని అరవసాగాడు.

జోగులు అతణ్ణి సమీపించి "ఒరే, దొంగ ముసలాడా! నీ దగ్గిరున్నవి రెండే పేర్లని నన్నే మోసం చేస్తావా?" అన్నాడు కోపంగా.

బలభద్రుడనే వాణ్ణి దేశం నుంచి బహిష్క రించాంగదా! మళ్ళీ ఏ ధైర్యంతో వీడు మన ముందుకొచ్చాడు?" అన్నాడు.

మంత్రి, జోగుల్ని తేరిపారచూసి, "మహా రాజా! వీడు బలభద్రుడు కాడు. వాణ్ణి తమ రెరగరు కాని, నేనెరుగుదును. వాడు తిరిగి మనదేశంలో ప్రవేశించాలని చూసి, సరిహద్దు కాపలా భటులవల్ల, ఏనాడో వధించబడ్డాడు," అని, జోగులుకేసి కళ్ళెర్ర చేసి, "ఒరే, నువ్వా మధ్య ఏదో నేరం చేసి, కొంతకాలం కారా గారంలో వుండి విడుదలైన జోగులనే దొంగవు కాదా?" అని ప్రశ్నించాడు.

ఆ ప్రశ్న వింటూనే జోగులు భయంతో గజగజలాడుతూ, "మన్నించండి, ప్రభూ! ఇదంతా ఆ కుంటివాడి పన్నాగం," అన్నాడు.

"ఎవరా కుంటివాడు? మహారాజులను మోసగించ చూస్తే, ఉప్పు పాతర వేస్తామని తెలీదా వాడికి?" అని గద్దించాడు మంత్రి.

ఆ వెంటనే, సభలో ఒక మూల కర్ర ఆస రాతో నిలబడి వున్న పోతురాజు ముందుకు వచ్చి, రాజుతో, "మన్నించండి, మహారాజా! ఒకప్పుడు తమవద్ద సైనికుడుగా వుండి యుద్ధంలో గాయపడి అవిటి వాణ్ణయ్యాను!" అని తన కుటుంబ దీనస్థితి చెప్పుకుని, "మరే దారీ లేక, ఈ జోగుల్ని తమవద్దకు చక్రధరుడిగా, మహాపాత్రుడిగా పంపాను. అయితే, వీడు నన్ను మోసం చేశాడు. తమ దర్శనం చేసుకునేందుకు మార్గ మేమిటా అని ఆలోచించి, చివరకు వీణ్ణి బలభద్రుడి పేరుతో పంపాను. దానితో వీడు దొరికిపో వడం, నాకు తమ దర్శన భాగ్యం కలగడం జరిగింది!" అన్నాడు.

రాజుకు పోతురాజు చెప్పింది విన్నాక, దేశంలో అంగవైకల్యానికి గురైన మరెందరో సైనికులు వుంటారన్న నిజం తెలియవచ్చింది. ఆయన వెంటనే పోతురాజుతో పాటు, అలాంటి వాళ్ళందరికీ నెలసరి భృతి ఏర్పాటు చేస్తూ ఆజ్ఞలు జారీ చేశాడు.

తర్వాత ఆయన, ఒకసారి కారాగార శిక్ష అనుభవించి కూడా, తిరిగి మోసాలకు పాల్ప డిన జోగులుకు ఐదేళ్ళ కఠిన కారాగార శిక్ష విధించాడు.



# నమ్మకస్థుడు

సీనయ్య అనే రైతుకు, పశువుల కాపరి ఒకడు కావలసి వచ్చాడు, అందుకోసం ఆయన అక్కడ, ఇక్కడ వాకబు చేస్తూండగా, యువకుడొకడు వచ్చి, ఏదైనా పని ఇవ్వమని అడిగాడు.

"నువ్వు నమ్మకస్థుడివీ, ఒళ్ళువంచి పని చేసేవాడివీ అయితే, నా పశువుల్ని కాసే నౌకరీ ఇస్తాను. ఇంతకుముందు ఆ పని చేసేవాడు, అడవికి మేతకు తోలిన ఆవుల్లో ఒకదాన్ని దూర గ్రామంలో అమ్మి, పులి ఎత్తుకు పోయిందని చెప్పాడు. ఈ దాపుల నున్న అడవిలో పులులు లేవు," అంటూ యువకుడికేసి అనుమానంగా చూడసాగాడు సీనయ్య.

"అయ్యా, నేనలాంటి వాణ్ణి కాదు. నా పేరు సత్యరాజు," అన్నాడు యువకుడు.

ఆ జవాబుకు సీనయ్య నవ్వుకుని, "సరే, పొద్దున ఆవుల్ని మేతకోసం అడవికి తోలాను. పోయి వాటిని ఇంటికి తోలుకురా. ఆతర్వాత, నీకు నౌకరీ ఇచ్చేదీ లేనిదీ ఆలోచిస్తాను," అన్నాడు.

సత్యరాజు బయలుదేరి అడవికి పోయి, సూర్యాస్తమయవేళకు పశువులతో తిరిగి వచ్చి, ఇంట్లో వున్న సీనయ్యను, "అయ్యా, ఆవులన్నిటినీ తోలుకొచ్చాను. ఆ నల్లావు మాత్రం ఒక పట్టాన మిగతా వాటితో కలవలేదు. ముప్పతిప్పలు పెట్టింది," అంటూ కేకవేసి పిలిచాడు.

సీనయ్య ఆవుల్లో నల్ల ఆవంటూ లేదు. అతడు ఆశ్చర్యపోతూ బయటికి వచ్చి చూశాడు. సత్యరాజు నల్లావు అనేది, బాగా బలిసిన అడవిదున్న!

ఆవుకూ, అడవిదున్నకూ తేడా తెలియని అమాయకుడయితేనేం? నమ్మకస్థుడు, శ్రమపడి పని చేసేవాడు అనుకుని, సీనయ్య అప్పటికప్పుడే సత్యరాజుకు నౌకరీ ఖాయం చేశాడు.





# విచిత్రపుష్పం

13

[రాకాసిమృగం కోసం బయలుదేరిన ఉత్తుంగుణ్ణి, అతనికి తోడుగా వెళ్ళిన దళనాయకుడు నాగసింహుడు సముద్రంలోకి తోసేశాడు. ఉత్తుంగుడు నాగపురికి వచ్చి రాజుకు సంగతి చెప్పాడు. రాజూ, సేనాధిపతీ, సైనికులను వెంటబెట్టుకుని సముద్రతీరం చేరారు. సముద్రంలో రాకాసిమృగం పడవలను తరుముకుంటూ రావడం కనిపించింది. ఉత్తుంగుడి ఆజ్ఞానుసారం సైనికులు రాకాసిమృగం మీదికి కాగడాలను బాణాల్లాగా వదిలారు. రాకాసిమృగం భగ్గుమని మండి నీళ్ళలో మునిగిపోయింది. రాజు నాగపురికి తిరిగివెళ్ళాడు. — తరవాత]

ఉత్తుంగుడూ, ముగ్గురు భటులూ బండలపై నుంచి కిందికి దిగి, మరికొందరు సైనికులతో కలిసి సముద్రమార్గద్వారం దగ్గరకి చేరారు. కాగడాలు పట్టుకుని వాళ్ళు అక్కడ చాలాసేపు నిలబడ్డారు. కాని, సముద్రం నుంచి ఎవరూ రాలేదు. తూరుపు దిక్కున వేగుచుక్క పొడుస్తున్నప్పుడు, ఎవరో నీళ్ళనుంచి అతికష్టం మీద పైకిరావడం కనిపించింది. ఉత్తుంగుడు ఒక్క గెంతున వెళ్ళి, వాడికి చేయి అందించి, నీళ్ళ నుంచి పైకి లాగి, ఆసరాగా నడుంచుట్టూ చేయి వేసి, పట్టుకునివచ్చి ఒకచోట కూర్చోబెట్టాడు. ఆ భటుడు బాగా అలిసిపోయి స్పృహ కోల్పోయే స్థితిలో ఉన్నాడు. వాడి శరీరంలో వేడి పుట్టించడానికి పాదాలనూ, అరచేతులనూ రుద్దసాగాడు ఉత్తుంగుడు. కొంతసేపటికి భటుడు కళ్ళు తెరిచి, "రాకాసి మృగం వచ్చిందా?" అని అడిగాడు బెదురు బెదురుగా చూస్తూ.



సరిగ్గా ఆ సమయంలో మండుతూ ఉన్న కాగడాలు దాని శరీరాన్ని తాకడంతో నీళ్ళలోకి మునిగింది. కొంతసేపటికి అది మా పడవల కింది నుంచి లేచి, పడవలను తల్లకిందులు చేసి, పువ్వులను ఏరుకోసాగింది. కానీ, తీరం నుంచి వచ్చిన కాగడాలు దాని తలనూ, శరీరాన్నీ మళ్ళీ తాకడంతో భగ్గుమని మండుతూ నీళ్ళలోకి మునిగిపోయింది. దిక్కుకొకరుగా పడిపోయిన మిగతా భటులేమయ్యారో తెలియదు. నేనిలా ఈదుకుంటూ తీరం చేరాను," అన్నాడు.

"దళనాయకుడు పడవలో నుంచి నన్ను తోసేశాడు. ఆతరవాత ఏం జరిగిందో నువ్వు రావడంవల్ల తెలిసింది!" అన్నాడు ఉత్తుంగుడు.

ఉత్తుంగుడు తల అడ్డంగా ఊపడంతో, "అవును, ఇక్కడికెలా వస్తుంది? సముద్రంలోనే మండిపోయింది కదా? దళనాయకుడు కూడా చచ్చాడు. రాకాసిమృగాన్ని తీరానికి చేర్చకపోతే, మాకు చావు తప్పదని ఆ దుర్మార్గుడు బెదిరిస్తూ వచ్చాడు. ఆఖరికి వాడే చచ్చాడు. తాను రాజునయితే మాకు మంచి మంచి బహుమతులూ, పదవులూ ఇస్తానని ఆశ చూపాడు. అయితే, హఠాత్తుగా సముద్రం నుంచి రాకాసిమృగం రావడంతో హడలిపోయాం. దళనాయకుడు ఒక పూల కట్టను తీసి, దాని ముందుకు విసిరాడు. కాని ఆ రాకాసిమృగం, బ్రహ్మాండమైన తన చేతులతో పడవలను పట్టుకోబోయింది.

"నిన్ను నీళ్ళలోకి తోసేసి, దళనాయకుడు మా దగ్గరికి వచ్చి, రాకాసిమృగాన్ని తనకు అనుకూలంగా మార్చుకుని, తానే నాగపురికి రాజును కాగలనని మాతో చెప్పాడు. ఆ దురాశే అతని ప్రాణం తీసింది!" అన్నాడు భటుడు.

"సరే, మనం ఇప్పుడు సేనాధిపతి దగ్గరికి వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాలి," అన్నాడు ఉత్తుంగుడు.

"అలాగే! నేనూ నీతో వస్తాను," అంటూ లేచి నిలబడ్డాడు భటుడు.

అప్పుడే సూర్యోదయమవుతున్నది. వాళ్ళకు సముద్ర జలాన్ని అనుకుని ఏదో మనిషి శవం కనిపించింది. వాళ్ళు దగ్గరికి వెళ్ళి చూశారు. ముఖం, ఒళ్ళూ కాలిపోయిన

వికారమయిన మనిషి శవం అది. దానిని పరిశీలించి చూసిన ఉత్తుంగుడు, "ఇది రాకాసిమృగం మృతదేహం కావచ్చు! ఇక్కడ ఇద్దరు భటులు కాపలా ఉండండి. నేను రాజధానికి వెళ్ళి, ఈ సంగతి చెబుతాను," అని అక్కడి నుంచి బయలుదేరాడు.

అతడు రాజధానిలోని సేనాధిపతి ఇల్లు చేరేసరికి, సేనాధిపతితో పాటు కాబూయీ కూడా అక్కడే ఉన్నాడు. అతన్ని చూడగానే, "భటులు ప్రాణాలతో గట్టు చేరారా? దళనాయకుడేమయ్యాడు?" అని అడిగాడు సేనాధిపతి.

"దళనాయకుడు రాలేదు, ప్రభూ! అసలు ఏం జరిగిందో మీరే స్వయంగా వినండి," అంటూ భటుణ్ణి చూపాడు ఉత్తుంగుడు.

భటుడి ద్వారా జరిగినదానిని విన్న సేనాధిపతి, "దళనాయకుడు నాగసింహుడు జలసమాధి అయి వుంటాడనడంలో సందేహం లేదు. అయినా, అతడి మరణవార్త రాజుగారికి ఆనందం కలిగిస్తుందని చెప్పలేము. ఎంతయినా అతడు రాజబంధువు కదా!" అని, అక్కడినుంచి రాజు దగ్గరికి బయలుదేరాడు. మిగతావాళ్ళు ఆయనను అనుసరించారు.

ఉత్తుంగుడూ, భటుడూ చెప్పిన విషయాలను సేనాధిపతి రాజుకు తెలియజేశాడు. రాజు అంతా విని, తల పైకెత్తి, ఉత్తుంగుడితో, "మాణిక్యపురితో పాటు, మా రాజ్యాన్ని కూడా ఆపద నుంచి రక్షించిన నీ సాహసం మెచ్చ తగినది. నీ ధైర్యం యువకులందరికీ ఆదర్శ



మవుతుంది. నీకు సమ్మతమైతే మా సైన్యంలో దళనాయకుడి పదవి ఇస్తాం, చేరతావా?" అని అన్నాడు.

అంతలో సేనాధిపతి, "చక్కటి ఆలోచన, ప్రభూ! ఉత్తుంగుడు సైన్యంలో చేరాడంటే, ఇంతకాలం సైన్యంలో చేరడానికి విముఖులుగా వున్న కొండజాతి యువకులు కూడా చేరేఅవకాశం ఉన్నది," అన్నాడు ఉత్సాహంగా.

"ఉత్తుంగుడు దళనాయకుడయ్యాడంటే మాకందరికీ కూడా నాయకుడు కాగలడు!" అన్నాడు కాబూయీ ఆనందంగా.

ఉత్తుంగుడు కొంతసేపు మౌనంగా ఊరుకుని, "మీరు నాపైన చూపుతున్న అభిమానానికి కృతజ్ఞుణ్ణి! అయితే, నేను మాణిక్యపురి



నుంచి ఎందుకు బయలుదేరి వచ్చానో మీ కందరికీ తెలుసు. నా రాక కోసం నావాళ్ళు ఎదురుచూస్తూంటారు. నేను త్వరగా అక్కడికి చేరడానికి అనుమతించండి. మీ అభిమానాన్నీ, కరుణనూ ఎన్నటికీ మరిచిపోను, మహారాజా!" అన్నాడు వినయంగా.

రాజు ఉత్తుంగుడి చేతులు పట్టుకుని, "శభాష్, నీ మాతృదేశాభిమానం మెచ్చదగినది. నీ ఇష్టానుసారమే వెళ్ళు. అయితే ఈ రోజు కాదు; ఒక్కరోజు ఆగావంటే సకల మర్యాదలతో నిన్ను సాగనంపడానికి ఏర్పాటు చేస్తాను," అన్నాడు రాజు.

ఉత్తుంగుడు సరే అన్నట్టు తల ఊపాడు. కాబూయీ, "తమరు అనుమతించారంటే, ఉత్తుంగుణ్ణి నేను మా గూడానికి వెంటబెట్టుకుని వెళ్ళి, మావాళ్ళకందరికీ చూపి వస్తాను," అన్నాడు.

"అలాగే, కాబూయీ! రేపీ పాటికి మీరిద్దరూ ఇక్కడ ఉండాలి," అన్నాడు రాజు.

"చిత్తం, మహారాజా!" అని చెప్పి కాబూయీ అక్కడినుంచి ఉత్తుంగుణ్ణి వెంటబెట్టుకుని, గూడానికి బయలుదేరాడు.

వాళ్ళు గూడెం చేరగానే, వాళ్ళను చూడడానికి కాచుకుని వున్న స్త్రీ పురుషులు సంతోషంతో చప్పట్లు చరుస్తూ నాట్యం చేశారు. కాబూయీ ఉత్తుంగుడి ప్రయాణం గురించి వాళ్ళకు చెప్పి, అతన్ని ఇంటికి తీసుకువెళ్ళాడు. కాబూయీ భార్య ఇద్దరికీ విందు భోజనం ఏర్పాటు చేసింది.

ఉత్తుంగుడు ఆ రాత్రి అక్కడే పడుకుని బాగా నిద్రపోయాడు. మరునాడు తెల్లవారి లేచినప్పుడు, అతనికి వాకిట్లో, చిత్ర అప్పుడే నాటిన మొక్కకు నీళ్ళు పోస్తూ కనిపించింది. ఆ మొక్క తాను ఇచ్చినదే అని గ్రహించి, ఉత్తుంగుడు చిన్నగా నవ్వుతూ ఆమెను సమీపించాడు.

చిత్ర తల పైకెత్తి, "నువ్వు మాణిక్యపురికి వెళ్ళక తప్పదన్నమాట!" అన్నది.

"అవును, నాకోసం అక్కడ మావాళ్ళు కాచుకుని ఉంటారు," అన్నాడు ఉత్తుంగుడు తన మాటలు ఆమెకు ఎంతవరకు అర్థమవుతాయో అన్న అనుమానంతో.



"ఇక్కడికి తిరిగివచ్చి, మా సైన్యంలో దళనాయకుడివి కావచ్చు గదా?" అని అడిగింది చిత్ర.

ఉత్తుంగుడికి దళనాయకుడు అన్న మాట అర్థమయింది. ఆమె ప్రశ్న ఏమై వుంటుందో ఊహించి, తల అడ్డంగా ఊపాడు.

చిత్ర కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ ఇంటి లోపలికి వెళ్ళిపోయింది. ఆ తరవాత ఉత్తుంగుడు అందరికీ చేయెత్తి వీడ్కోలు చెప్పి కాబూయి వెంట రాజధానికి బయలుదేరాడు.

రాజభవనం దగ్గర రాజు, ఉత్తుంగుడి రాక కోసం, తన పరివారంతో ఎదురుచూస్తున్నాడు. ఉత్తుంగుడూ, కాబూయి రాజుకు నమస్కరించారు. రాజు వాళ్ళను సాదరంగా ఆహ్వానించి, కూర్చోమని ఆసనాలను చూపాడు. వాళ్ళు కూర్చున్న తరవాత సేనాధిపతి దుర్జయుడు లేచి నిలబడి, ఉత్తుంగుణ్ణి సభాసదులకు పరిచయం చేశాడు. సభికులందరూ ఉత్తుంగుణ్ణి ఆశ్చర్యంగా చూడసాగారు. ఉత్తుంగుడు వినయంగా లేచి నిలబడి సభకు గౌరవంగా నమస్కరించాడు. సభికుల కరతాళ ధ్వనులతో సభాప్రాంగణం మారుమోగింది.

ఆ తరవాత రాజు లేచి, ఉత్తుంగుణ్ణి సమీపించి, "ఉత్తుంగా! నీ సాహసం, మాతృదేశభక్తి బహుధా ప్రశంసనీయం. నిన్ను మన సారా అభినందిస్తున్నాను," అంటూ తన కంఠహారాన్ని తీసి అతని మెడలో వేసి ప్రేమతో కౌగిలించుకున్నాడు.

ఉత్తుంగుడు రాజుకూ, రాణికీ నమస్కరించి యువరాణి మల్లిక దగ్గరికి వెళ్ళగానే ఆమె, "రాకాసిమృగం నుంచి మా రాజ్యాన్ని కాపాడినందుకు ధన్యవాదాలు!" అన్నది.

ఉత్తుంగుడు చేతులెత్తి నమస్కరించి, సేనాధిపతి దగ్గరికి వచ్చాడు.

"రాకాసిమృగం మృతదేహాన్ని సముద్ర తీరంలోనే నిన్న భూస్థాపితం చేయించాం. నీకు తోడుగా రెండు పడవలలో మా సైనికులు మాణిక్యపురి వరకు వస్తారు. వాళ్ళు అప్పుడే సముద్రతీరం చేరారు. అక్కడ నీ కోసం ఎదురు చూస్తూంటారు. కాబూయీ, సముద్రతీరం వరకు వచ్చి సాగనంపుతాడు. నువ్వు ఇప్పుడే బయలుదేరవచ్చు. మీ రాజు



గారికి మా శుభాకాంక్షలు తెలియజెయ్యి," అన్నాడు సేనాధిపతి.

ఉత్తుంగుడు మరొకసారి సభికులందరికీ నమస్కరించి, కాబూయీ వెంట నడిచాడు. సభికులందరూ గౌరవంగా లేచి నిలబడ్డారు. కాబూయీ, ఆప్యాయంగా ఉత్తుంగుడి చేయి పట్టుకుని సముద్రతీరం కేసి బయలుదేరాడు.

వాళ్ళు సముద్రతీరం చేరేసరికి, అక్కడ ఉత్తుంగుడి పడవ, పూలతో అందంగా అలంకరించబడి ఉన్నది. పడవ నిండా ఏవేవో కానుకలూ, పళ్లూ ఉన్నాయి.

కాబూయీ కూతురు చిత్ర, స్నేహితురాళ్ళతో ఎదురువచ్చి, చేతిలోని శతాబ్దిక పుష్పాలను చూపుతూ, "సముద్రపు అలలు గట్టుకు చేర్చిన ఈ పుష్పాలను అక్కడే సేకరించాము," అన్నది నవ్వుతూ.

"అలాగా! వాటిలో కొన్నిటిని నా కానుకగా యువరాణి మల్లికకు ఇవ్వండి," అంటూ ఉత్తుంగుడు నవ్వుతూ పడవకేసి నడిచాడు.

కాబూయీ అతన్ని ఆఖరిసారిగా ఆప్యాయంగా కౌగిలించుకుని, పడవలోకి ఎక్కించాడు. అతడు కూర్చోగానే ఇద్దరు భటులు పడవను నీళ్ళలోకి తోశారు. అది ముందుకు వెళ్ళగానే రెండు పడవలలో కొందరు భటులు దానివెంట బయలుదేరారు. సాయంకాలానికి మూడు పడవలూ మాణిక్యపురి రాజ్యతీరాన్ని సమీపించాయి. వాటిని గమనించిన కాపలా భటులు ఆ సంగతి సేనాధిపతి గంభీరవర్మకు తెలియజేశారు. ఆ వార్తను కొందరు భటుల ద్వారా రాజుకు పంపి, సేనాధిపతి హుటాహుటిగా సముద్రతీరం చేరాడు. ఆయన వచ్చేసరికి ఉత్తుంగుడు పడవ నుంచి దిగి, ఎదురు వస్తూ, "రాకాసిమృగం మరణించింది!" అన్నాడు.

"నువ్వే దానిని హతమార్చావా?" అని అడిగాడు సేనాధిపతి నమ్మలేనట్టు.

"లేదు! ఆ సంగతి తరవాత వివరంగా చెబుతాను. మీరందరూ క్షేమమే కదా? రాజు, యువరాణి, మా చెల్లెలు క్షేమంగా ఉన్నారా?" అని అడిగాడు ఉత్తుంగుడు.

"అందరూ క్షేమంగా ఉన్నారు!" అంటూ సేనాధిపతి మాణిక్యపురి కేసి బయలుదేరాడు. ఆయనవెంట వెళుతూ రాకాసిమృగం ఎలా

మరణించిందీ వివరంగా చెప్పాడు ఉత్తుంగుడు. మాణిక్యపురి రాజభవనం ముందు రాజు ప్రతాపవర్మ, యువరాణి ప్రియంవద, ఉత్తుంగుడి చెల్లెలు రజని, ఉత్తుంగుడికి ఎదురు వచ్చారు.

"భైరంబీమాత నిన్ను రక్షించు గాక!" అంటూ రాజు ఉత్తుంగుడి చేయి అందుకుని భవనం లోపలికి నడిపించాడు.

"రాకాసిమృగం పీడ ఎలా విరగడయిందో నీ నుంచి స్వయంగా వినాలని ఉన్నది!" అన్నది యువరాణి ఉత్తుంగుడి వెనక నడుస్తూ.

"శుంభుణ్ణి రమ్మని కబురు చేశాను. అతడు త్వరలో రాగలడు," అంటూ రాజు ఉత్తుంగుడు కూర్చోవడానికి ఆసనం చూపి తనూ కూర్చున్నాడు.

మరునాడు రాజగురువు గౌరీనాథుడు వచ్చి, ఉత్తుంగుడు చెప్పినదంతా విని, "రాకాసిమృగం మరణంతో శతాబ్దిక పుష్పాలకు కలిగిన శాపం కూడా తొలగిపోయిందనడంలో సందేహం లేదు. ఇకపై ఆ పువ్వులు యేటా పూయగలవు!" అన్నాడు.

"ఇప్పుడు ఈ పూల మొక్కలను మన ఉద్యానవనంలో పెంచవచ్చు కదా, గురువర్యా!" అన్నది యువరాణి ఉత్సాహంగా.

"నిక్షేపంగా," అన్నాడు గౌరీనాథుడు మందహాసం చేస్తూ.

"అలాగే చెయ్యి, తల్లీ! మరొక్క మాట. విచిత్రపుష్పాలకు మించిన మరొక విలువైన బహుమతిని నీకు ఇవ్వాలనుకుంటున్నాను. తీసుకుంటావా?" అన్నాడు రాజు.

"ఏమిటి?" అన్నట్టు చూసింది ప్రియంవద ఆశ్చర్యంగా.

"నీకూ, ఉత్తుంగుడికీ వివాహం చేయాలనుకుంటున్నాను. ప్రజల రక్షణ కోసం ప్రాణాలకు తెగించి పోరాడిన ఉత్తుంగుడు నీ పాణిగ్రహణం చేయడానికి తగినవాడని భావిస్తున్నాను. నీకు సమ్మతమే కదా?" అన్నాడు రాజు.

ప్రియంవద సిగ్గుతో తల వంచుకుని, రజని చేయిని పట్టుకున్నది. రజని ఆనందంగా నవ్వుతూ ఆమె చేతిని తీసి, మందహాసం చేస్తూన్న అన్నయ్య ఉత్తుంగుడి చేతిలో పెట్టింది. — (అయిపోయింది)






# ఆత్మాభిమానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పట్టుదలతో అర్ధరాత్రి వేళ, ఈ శ్మశానంలో తిరుగుతూ, నువ్వు సాధించదలచినదేమైనా, ముందు దాన్ని గురించి క్షుణ్ణంగా ఆలోచించడం మేలు. అలా కానప్పుడు, ఆవేశకావేషాలకులొంగి, వచ్చిన అమూల్యావకాశాన్ని చేజార్చుడం జరుగుతుంది. ఇందుకు ఉదాహరణగా, వంశీకృష్ణ అనే ఒక అమాయక యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం చంద్రశిలా నగర యువరాణి దేవదత్త, ఒకనాడు చెలికత్తెలతో కలిసి రథంలో వన విహారం బయలుదేరింది. రథం కాసేపటికి అడవిలో ప్రవేశించింది. ఆమె రకరకాల

## బేతాళ కథలు



మురళిని వాయించడం మాని పక్కన పెట్టాడు.

ఆ సమయంలో యువరాణి అభినందన పూర్వకంగా చప్పట్లు కొట్టింది. అప్పుడా యువకుడు ఉలిక్కిపడి తల తిప్పి చూసి కంగారు పడ్డాడు. అది చూసి యువరాణి చిన్నగా నవ్వు కున్నది.

తర్వాత ఆమె యువకుడితో, "నీ మురళీ గానం నాకెంతో నచ్చింది. ఇంతకూ నీ పేరే మిటి?" అని అడిగింది.

"నా పేరు వంశీకృష్ణ. ఈ అడవి అంచున వున్న పల్లెటూరు మాది. ఆవుల్ని మేపేందుకు రోజూ అడవికి వస్తూంటాను," అని బంగారు బొమ్మలా వున్న దేవదత్తను రెప్పవేయకుండా చూస్తూ జవాబిచ్చాడు వాడు.

యువరాణి కాసేపు మౌనంగా వుండి, "చూడు, వంశీకృష్ణా! నేనీదేశపు యువరాణిని. నీ మురళీగానం అద్భుతంగా వున్నది. నీకు అభ్యంతరం లేకపోతే కోటకు రా. నీకు సకల సదుపాయాలూ ఏర్పాటుచేసి, మంచి జీతం ఇస్తాను. నువ్వు చెయ్యవలసిందల్లా, నీ మురళీగానంతో ప్రతి రోజూ మమ్మల్ని ఆనందపరచడం. తొందరలేదు, బాగా ఆలో చించుకునే ఒక నిర్ణయానికి రా. నా తృప్తి కోసం దీన్ని తీసుకో!" అంటూ మెళ్ళోని వజ్రాల హారాన్ని వాడికి కానుకగా ఇచ్చింది.

ఆసరికి సూర్యాస్తమయం కాబోతున్నది. వంశీకృష్ణ ఆవులను అదిలించి తన గ్రామం

పక్షుల కిలకిలారావాలు వింటూ పరవశించి పోసాగింది.

ఇంతలోదాపులనుంచి ఎంతో మధురమైన మురళీగానం, ఆమె చెవులకు సోకి ఆశ్చర్యంతో పాటు తన్మయత్వం కలిగించింది. వెంటనే ఆమె రథం దిగి, తన చెలికత్తెలతో పాటు మురళీగానం వినవస్తున్న దిశకేసి గబగబా వెళ్ళింది.

ఒక మర్రి చెట్టు కింద పాతికేళ్ళ యువకు డొకడు కళ్ళు మూసుకుని, లోకాన్ని మరిచి మురళి వాయిస్తున్నాడు. కొద్ది దూరంలో కొన్ని ఆవులుపచ్చిక మేస్తున్నాయి. యువరాణి తన చెలికత్తెలతో కలిసి నిశ్శబ్దంగా, ఆ యువకుడి వెనకకు వెళ్ళింది. కొద్ది సేపటికి యువకుడు

కేసి మళ్ళించాడు. దేవదత్త కూడా చెలికత్తెలతో కలిసి రథం ఆపిన చోటుకు బయలు దేరింది.

వంశీకృష్ణకు ఆ రాత్రి నిద్రపట్టలేదు. వాడి ఆలోచనలన్నీ యువరాణి చుట్టూ తిరగసాగాయి. రాత్రంతా ఆలోచించి వాడు, చివరికి పల్లెవదిలి రాజుగారి కోటకు వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు.

ముసలి తండ్రితో వచ్చిన వంశీకృష్ణను, దేవదత్త సాదరంగా ఆహ్వానించింది. కోటలోని ఒక ప్రత్యేక మందిరాన్ని వాడి నివాసానికిగాను ఇచ్చారు. ఆ రోజు నుంచి వాడి జీవిత విధానమే మారిపోయింది. యువరాణి కోరినప్పుడు తన మురళీగానాన్ని వినిపించడమే వంశీకృష్ణ పని. నెలకు వేయి వరహాల జీతం.

ఇలా వుండగా, ఒకనాడు, రవిచంద్ర అనే పరదేశి ఒకడు మహారాజును దర్శించాడు. తాను మురళిని వాయించడంలో గొప్ప విద్వాంసుణ్ణని, ఆ పరదేశి యువకుడు చెప్పుకున్నాడు. ఆ సమయంలో సభలో తండ్రి పక్కనే కూర్చుని వున్న దేవదత్త, ఆ యువకుణ్ణి మురళి వాయించమని కోరింది. అతడు ఒక అరగంట సేపు మురళిని అద్భుతంగా వాయించాడు. సభికులు ప్రశంసాపూర్వకంగా కరతాళ ధ్వనులు చేశారు. మహారాజు అతణ్ణి విలువైన కానుకలతో సత్కరించాడు.

రవిచంద్ర మురళీగానం విన్నాక, వంశీకృష్ణ గానం చాలా పేలవంగా తోచింది, దేవదత్తకు. శాస్త్రీయ ధోరణిలో అతడు వాయించిన తీరు సమ్మోహనంగా వుందామెకు. ఇక అక్కడి






నుంచి వెళ్ళబోతున్న అతడితో, ఆమె, "నీ లాంటి గొప్ప సంగీత విద్వాంసుడు మా ఆస్థానాన్ని అలంకరించడం, మాకు గొప్ప గర్వకారణమవుతుంది!" అని తండ్రిని, "ఇంతకూ మీరేమంటారు, నాన్నగారూ?" అని అడిగింది.

ఆ వెంటనే మహారాజు, రవిచంద్రుణ్ణి, "చూడు, రవిచంద్రా! నువ్వీ రోజు నుంచి మా ఆస్థాన విద్వాంసుడివి. నెలకు నాలుగు వేల వరహాల జీతం. ఇష్టమేనా?" అని అడిగాడు.

రవిచంద్రుడు పరమానందంగా అందుకు అంగీకరించాడు. ఇది జరిగాక క్రమంగా ఆస్థానంలో వంశీకృష్ణ ప్రాధాన్యత తగ్గిపోయింది. దేవదత్త ఇప్పుడు వంశీకృష్ణ మురళీగానం వినడానికి బొత్తిగా ఆసక్తి చూపడం లేదు.

ఈ పరిస్థితుల్లో, ఒకనాడు సూర్యశిలా నగర యువరాణి పద్మరజని తన వివాహ శుభలేఖను స్వయంగా అందజేయాలని, చంద్రశిలా నగరానికి వచ్చింది. పద్మరజని, దేవదత్తకు వరసకు పినతల్లి కూతురవుతుంది. కాసేపు వాళ్ళిద్దరూ చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుని నవ్వుకున్నారు.

తర్వాత పద్మరజని తన చెలికత్తె చేతిలోని బంగారు పంజరాన్ని అందుకుని, చిలకను బయటకు తీసి, "అక్కా! ఇది కేవలం మాటలు నేర్చిన చిలకే కాదు; పాటలు కూడా పాడుతుంది," అని చిలక ప్రత్యేకతను వివరించింది.

చిలక కాసేపు ముద్దుగా మాట్లాడి, ఒకపాట కూడా పాడింది. దేవదత్త దాని ప్రావీణ్యానికి అబ్బురపోయి, చిలకను ముద్దు పెట్టుకుంది. "అబ్బ! నీ ముద్దు ఎంత తియ్యగా వుందో!" అన్నది చిలక. దాని మాటలకు ఆ అక్కాచెల్లెళ్ళు విరగబడి నవ్వారు.

ఆ సాయంత్రం కాలక్షేపం కోసం, ఉద్యానవనంలో వంశీకృష్ణ మురళీగాన కచేరీ ఏర్పాటు చేసింది, దేవదత్త. రవిచంద్రుడు ఆ రోజు ఏదో అత్యవసరమైన పనిమీద పొరుగూరు వెళ్ళడంతో, వంశీకృష్ణకు ఈ అవకాశం లభించింది.

వంశీకృష్ణ మురళీగానం పద్మరజనిని బాగా ఆకట్టుకుంది. ఆస్థానంలో అందరూ అభిమానించే మరొక గాయకుడు వున్నాడని ఆమె విని వుండడంతో, దేవదత్తను, "అక్కా! ఇంత చక్కగా మురళీగానం చెయ్యగల వాళ్ళు చాలా అరుదు. నీకు అభ్యంతరం లేకపోతే, రేపు వంశీకృష్ణను నా వెంట పంపించు. అక్కడ నాకు మంచి కాలక్షేపంగా వుంటాడు," అని అడిగింది.

"అలాగే, రజనీ! కానీ వెళ్ళేటప్పుడు నీ చిలకను మాత్రం ఇక్కడ వదిలి వెళ్ళాలి సుమా!" అన్నది దేవదత్త మందహాసం చేస్తూ.

"నిరభ్యంతరంగా తీసుకో. దాని మాటలూ, పాటలూ వినీ వినీ నాకూ విసుగు పుట్టింది," అన్నది పద్మరజని.

అంతవరకూ వాళ్ళ సంభాషణ మౌనంగా వింటున్న వంశీకృష్ణ కల్పించుకుని, "మన్నించండి, యువరాణీ! నేను రేపే మా స్వగ్రామం వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాను," అన్నాడు.

"నువ్వు జీతం గురించి ఆలోచిస్తున్నావేమో, ఇక్కడ ఇస్తున్న దానికంటే, మరి నాలుగు వందల వరహాలు ఎక్కువగా ఇస్తాం. సరేనా?" అని అడిగింది పద్మరజని, వంశీకృష్ణను ఒప్పించాలని.

కాని, వంశీకృష్ణ దృఢస్వరంతో, "క్షమించండి, యువరాణీ! మీరెంత జీతం ఇచ్చినా, నేను మీవెంట రాను. నా నిర్ణయానికి తిరుగు లేదు," అన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వంశీకృష్ణ తనకు, సూర్యశిలా నగర యువరాణి



పద్మరజని ఇవ్వ జూపిన అమూల్యావకాశాన్ని చేజార్చుకోవడం, మూర్ఖత్వ మనిపించుకోదా? అంతేకాక, అతడికి తనలా కాక, సంగీత శాస్త్ర జ్ఞానంతో మురళి వాయించే రవిచంద్ర మీద అసూయ వున్నదని, మనం భావించడం పొరబాటు కాదనుకుంటాను. పైగా, అతడికి తన ఉన్నతికి కారణమైన యువరాణి దేవదత్త పట్ల కృతజ్ఞతా భావం ఏమాత్రం వున్నట్టు కనబడదు. అది సరికాదనుకుంటే, ఆమె మాటను కాదనక, పద్మరజని వెంట వెళ్ళిపోయేవాడు కదా? ఈ అన్ని కారణాల వల్ల, వంశీకృష్ణ అసూయాపరుడు, మూర్ఖుడు, కృతఘ్నుడు అనే కాక, తనలో ఇతరుల పట్ల పెంచుకున్న ఆవేశ కావేషాలకు లొంగిపోయి నిర్ణయాలు చేసే తత్వం కలవాడన్నది నిర్వివాదాంశం కదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వంశీకృష్ణ, పద్మరజని కోరిన విధంగా సూర్యశిలా నగరానికి వెళ్ళ నిరాకరించడానికి, పైన చెప్పినవేవీ కారణాలు కాదు. అతడు తిరిగి స్వగ్రామం వెళ్ళిపోవాలనుకోవడానికి, అర్థంలేని ఆవేశం కారణం అనడం పెద్ద పొరబాటు. దేవదత్త కనీసం మాట మాత్రంగానైనా అతడి అభిప్రాయం తెలుసుకోకుండా, అతణ్ణి పద్మరజని వెంట పంపడానికి సిద్ధపడింది. ఇది వంశీకృష్ణ ఆత్మాభిమానాన్ని తీవ్రంగా గాయపరిచింది. సహజంగా బానిసలను మాత్రమే, వాళ్ళ ఇష్టా ఇష్టాలతో నిమిత్తం లేకుండా, వాళ్ళ యజమానులు క్రయవిక్రయాలు జరుపుతూంటారు. చిలకను తనకు ఇచ్చి, వంశీకృష్ణను తీసుకు వెళ్ళమని దేవదత్త, పద్మరజనికి చెప్పింది. ఇది విన్న వంశీకృష్ణ తన ఆత్మగౌరవాన్నీ, వ్యక్తిత్వాన్నీ కాపాడుకునేందుకు, పద్మరజని వెంట వెళ్ళడానికి నిరాకరించాడు. ఇందులో మూర్ఖత్వానికీ, కృతఘ్నతకూ ఆస్కారం లేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: రాఘవరాజు పట్టాభిరామరాజు రచన]





# కాశీ పండితుడు

గౌరీపుర అగ్రహారంలో తిమ్మావధాని అనే కాశీ పండితుడుండేవాడు. ఆయన చిన్నతనంలో ఇంట్లోంచి పారిపోయి, కాశీలో పండితుల వద్ద శాస్త్రాలు చదివి నాలుగేళ్ళ తర్వాత ఇంటికి తిరిగివచ్చాడు. కాశీలో విద్యాభ్యాసం చేసి వచ్చిన కారణంగా అందరూ ఆయనను కాశీ పండితుడంటూ గౌరవించేవారు. దానితో ఆయనలో అహం పెరిగి, తోటి పండితులను అవహేళన చేస్తూ మాట్లాడడం ఒక దురలవాటుగా తయారయింది.

ఒకసారి ఆయన తన చెల్లెల్ని చూసేందుకు హరిహరపురం వెళ్ళాడు. రాత్రి భోజనాలయ్యాక చెల్లెలు అన్నతో, "అన్నయ్యా, రాత్రికి దేవాలయంలో కల్యాణ మహోత్సవాలు జరుగుతున్నవి. ఆ సందర్భంగా సీతా రామకల్యాణం అనే తోలు బొమ్మలాట ప్రదర్శన వుంటుంది. దాన్ని మీ బావగారే రచించారు. నీవంటి కాశీపండితుడు చూసి మెచ్చుకుంటే, ఆయన రచనకు మరింత విలువ వస్తుంది," అన్నది.

ఇందుకు తిమ్మావధాని ఈసడింపుగా నవ్వి వూరుకున్నాడు.

రాత్రికి దేవాలయం ముందున్న ఆవరణలో తోలుబొమ్మలాట ప్రదర్శన ప్రారంభమయింది. బొమ్మలాట ప్రదర్శకులు కాశీపండితుడైన తిమ్మావధానికి అభివాదం చేశారు.

"అయ్యా! అల్ప పరిజ్ఞానం కలవాళ్ళం. మీ వంటి పండితులు రావడం మాకెంతో ప్రోత్సాహకరం. ఏవైనా దోషాలుంటే క్షమించండి," అని వినయంగా చెప్పారు.

దీనికి తిమ్మావధాని గర్వంతో మిడిసిపడుతూ, "మీది కూటికోసం కళ. అయినా, మా బావగారి లాంటి పండితులే మీకు రచనలు చేసి పెడుతున్నారు గనక, మా బావగారి మీదవుండే అభిమానంతో మార్పులు, చేర్పులు వుంటే సూచిస్తాను," అన్నాడు.

జె. ఉదయనాగ శిరీష

ఆట ప్రారంభమైంది. దశరథుడి పుత్ర కామేష్ఠి యాగ ఘట్టం వచ్చింది. దశరథుడు యాగశాలను నిర్మించి, ఇరవై యొక్క రకాల చెట్ల కొయ్యలతో యూపస్తంభాలను పాతించాడని ప్రదర్శకుడు చెప్పాడు.

అంతే! తిమ్మావధాని చివాలునలేచి, "ఏమిటీ! యాగశాలలో ఇరవైయొక్క రకాల చెట్ల కొయ్యలతో యూపస్తంభాలు పాతారా? సరే, ఇరవై ఒకటి అక్కర్లేదు. కనీసం యూపస్తంభాలకు ఉపయోగించిన పదిరకాల చెట్ల పేర్లు చెప్పండి చూద్దాం!" అన్నాడు.

ఇది విన్న ప్రధాన ప్రదర్శకుడికి చాలా కోపం వచ్చింది. వాడుతీవ్రస్వరంతో, "అయ్యా! పొట్టకూటి కోసం చేసే ఈ ప్రదర్శనలో, మేం అతిశయోక్తులు పలికాం. యాగశాలలో ఉపయోగించే ఇరవైయొక్క రకాల చెట్ల పేర్లు మావంటి పామరులకెలా తెలుస్తుంది. మీ వంటి పండితులు, ఆ ఇరవైఒక్క పేర్లు చెబితే, ఇకపైచేసే ప్రదర్శనలలో వాటి పేర్లు చెప్పుకుంటాం," అన్నాడు. తిమ్మావధానికి పచ్చివెలక్కాయ నోట పడినట్టయింది. అప్పటికప్పుడు, ఆ ఇరవైఒక్క చెట్ల పేర్లు చెప్పాలంటే తలకు మించిన పని. ఈ అవమానాన్నుంచి ఎలా బయటపడాలా అని ఆలోచించసాగాడు.

ఇది గమనించిన ఆయన బావమరిది, ప్రదర్శకుడితో, "మా బావగారు గొప్ప కాశీ పండితుడు. ఆయనకు తెలియని విషయం లేదు. ఆ యూపస్తంభపు చెట్ల పేర్లు ఆయనే నాకు చెప్పాడు. ఆ పేర్లే నేను మీకు రాసి ఇచ్చాను. అందుచేత, ఆ పేర్లు చెప్పమని ఆయన నడగడం, పండిత ధిక్కార మవుతుంది. ఆ పేర్లు మీరే చెప్పి, సమర్థులని పేరు తెచ్చుకునేందుకు, ఆయన ఆ విధంగా మిమ్మల్ని ప్రశ్నించాడు. ఆ పేర్లన్నీ చెప్పండి!" అన్నాడు. జనమంతా చప్పట్లు చరుస్తూంటే, ప్రధాన ప్రదర్శకుడు ఒక్కొక్క యూపస్తంభం చేయబడిన చెట్టు పేరు చెప్పసాగాడు.

ఇది జరిగాక తిమ్మావధానికి, తను గొప్ప కాశీపండితుడి నన్న గర్వం వదిలిపోయింది. ఆ తర్వాత ఆయన పండితులతో వినయంగా, పామరులలో మర్యాదగా మాట్లాడడం అలవాటు చేసుకున్నాడు.



# చందమామ అనుబంధం - 66

మనదేశపు చెట్లు :



## మామిడి

ఏప్రిల్ నెలతో మామిడిపళ్ళ కాలం ఆరంభమవుతుంది. ఏప్రిల్ – ఆగస్టు నెలల మధ్యే మనం చెట్లలోనూ, కొట్లలోనూ మామిడి పళ్ళను చూడగలం. ఢిల్లీ, బొంబాయి వంటి నగరాలలో ఈ సమయంలో మామిడి సంతలు ఏర్పాటు చేస్తారు. మామిడిలో దాదాపు ఐదు వందల రకాలు ఉన్నాయి. సువర్ణరేఖ, మల్గోవా, బంగనపల్లి, నీలం మొదలైనవి ఆంధ్రలోనే కాకుండా దక్షిణ భారతదేశంలో ప్రసిద్ధిగాంచిన రకాలు. లాంగ్రా, చౌసా, దుషేరీ, అనేవి ఉత్తర ప్రదేశ్‌లోనూ, బీహార్‌లోనూ; గులాబ్ ఖాస్, బొంబయ్ బెంగాల్‌లోనూ ప్రసిద్ధిగాంచిన రకాలు. అయితే, మహారాష్ట్రకు చెందిన అల్ఫాన్‌జో అనే రకం చాలా ప్రశస్తమయినది; ఖరీదయినది కూడా. ఆంధ్ర ప్రాంతానికి చెందిన తెన్నేరు అనే మామిడి పళ్ళు 1.6 కి.గ్రా. బరువూ, 23 సెం.మీ. పొడవూ ఉంటాయి. దీనిని 'రారాజు'గా చెప్పుకున్నప్పటికీ మిగతా పళ్ళలాగా అంత తియ్యగా ఉండదు.

18వ శతాబ్దానికి చెందిన లిన్నే అనే వృక్ష శాస్త్రవేత్త మనదేశపు మామిడికి — 'మాంగిఫెరా ఇండికా' అని పేరు పెట్టాడు.

మామిడి చెట్లు పెద్ద పెద్ద కొమ్మలతో దాదాపు 15 మీటర్ల ఎత్తు పెరుగుతాయి. రెండువైపులా మొనదేలిన ఆకులు 6 సెం.మీ. వెడల్పూ 15 సెం.మీ. పొడవూ ఉంటాయి. చిన్న చిన్న పువ్వులు పసుపు పచ్చ రంగులో గుత్తులు గుత్తులుగా పూస్తాయి. పెద్ద టెంకతో చుట్టూ మెత్తటి గుజ్జుతో చూడడానికి మనిషి గుండెలాగా కనిపించే మామిడి పండును 14వ శతాబ్దికి చెందిన సుప్రసిద్ధ కవి అమీర్ ఖుస్రో 'రాజఫలం' అని వర్ణించాడని చెబుతారు. అయితే, రామాయణ, మహాభారతాలలో కూడా మామిడి ప్రస్తావన ఉన్నది.




[ప్రపంచంలోని ప్రతి మతానికీ ఏదో ఒక గొప్ప గ్రంథం ఆధారంగా ఉంటున్నది. కొన్ని మతాలకు పలు గ్రంథాలు ఉన్నాయి. ఒక్కొక్క మతానికి చెందిన ఒక సుప్రసిద్ధ గ్రంథం గురించి ఇక్కడ క్లుప్తంగా తెలియ జేస్తున్నాము.]

# వేదాలు

"భారతీయ చింతన ఋగ్వేదంలో ఉన్నత శిఖరాలను అందుకున్నది. ఋగ్వేదం మన దేశంలోనే కాదు; ప్రపంచంలోనే తొలి గ్రంథం. మానవ శేముషీ పరిణతిని అది సూచిస్తుంది," అంటాడు ప్రముఖ భారతీయ పండితుడు డా।। రాధాకుముద్ ముఖర్జీ.

ప్రాచీన కాలం నుంచి ప్రపంచంలో వివిధ ప్రాంతాలలో రకరకాల నాగరికతలు వెలిశాయి. అయితే, దాదాపు నాలుగు వేల సంవత్సరాలకు పూర్వం మనదేశంలో వెలసిన వేదకాలం నాగరికతలాగా మరేనాగరికతా వేదాల వంటి ఉద్గ్రంథాలను సృష్టించలేదు.

వేదం అంటే జ్ఞానం అని అర్థం. సనాతన ఋషులు ధ్యాన నిమగ్నులై ఉన్నప్పుడు మనసులలో వినిపించిన భావాలను వేదశ్లోకాలుగా పలికారు. అందుకే వీటిని శృతులు అని అంటారు. వేదాలు నాలుగు. అవి: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం.

వేదాలు ప్రాచీన సంస్కృత భాషలో ఉన్నాయి.



కొన్ని శతాబ్దాల వరకు వేదాలను లిఖిత బద్ధం చేయలేదు. గురు

వులు వల్లిస్తూంటే, శిష్యులు శ్రద్ధగా విని నేర్చుకునే వాళ్ళు. వేదాలను స్వరయుక్తంగా జ్ఞాపకం ఉంచుకోవడానికి గురుశిష్యులు కొన్ని తరాలపాటు కఠినమైన క్రమశిక్షణను పాటించారు.

వేదమంత్రాలు — గాలి, వెలుతురు, వాన, మొదలైన ప్రకృతి శక్తులకు అధిదేవతలయిన వాయువు, అగ్ని, వరుణుడు మొదలైన వారిని కృతజ్ఞతా పూర్వకంగా ప్రార్థిస్తాయి. సృష్టిలోకంతటికీ మహోన్నతమైన మానవ జీవితాన్ని శ్లాఘిస్తాయి. మానవ జీవితం దివ్యత్వం పొందడానికి మానవులు ఆచరించవలసిన ఉత్తమ ధర్మాలను బోధిస్తాయి.

జీవితమంటే ఏమిటి? దాని పరమార్థమేమిటి? మనిషి ఎందుకు పుడతాడు? ఎందుకు మరణిస్తాడు? మరణానంతరం ఆత్మ ఏమవుతుంది? దేవతలంటే ఎవరు? అసలు సత్యం ఏది? మొదలగు జటిలమైన ఆధార తాత్విక ప్రశ్నలకు సమాధానాలు వేదసూత్రాలలో నిగూఢంగా చెప్పబడినాయి.

ఋషుల వంటి వారే వాటిని వివరించగలరు. నిజమైన జిజ్ఞాసతో వచ్చే శిష్యులకు ఆ రహస్యాలను తెలియజేస్తారు.

హిందూమతం అని ఉత్తరోత్తరా పేరొందిన సనాతన ధర్మానికి వేదాలే ఆధార గ్రంథాలు!



# మీకు తెలుసా?

1. హైందవ పురాణాల ప్రకారం మొట్టమొదట మరణించిన మానవుడు ఎవరు?
2. రష్యా – జపాన్‌ల మధ్య జరిగిన యుద్ధం ఆపడానికి కృషి చేసినందుకుగాను ఒక అమెరికా అధ్యక్షుడికి నోబెల్ శాంతి బహుమతి లభించింది. ఆయన ఎవరు?
3. ఫిలిప్పైన్స్ ఎన్ని దీవుల సముదాయం?
4. అందరికన్నా ఎక్కువ కాలం ఇంగ్లాండును పాలించిన వారెవరు? ఎంతకాలం?
5. బొంబాయిలోని 'గేట్ వే ఆఫ్ ఇండియా' ఏ బ్రిటిష్ రాజు గౌరవార్థం నిర్మించబడింది?
6. అమెరికాలోని అతి ప్రాచీనమైన విశ్వవిద్యాలయం ఏది?
7. ప్లాస్టిక్‌ను ఎవరు కనుగొన్నారు?
8. టర్కీ ఇప్పటి రాజధాని అంకారా. ఇంతకు ముందు దాని రాజధాని ఏది?
9. రెండు వేల సంవత్సరాలకు పూర్వం ఆసియాలోని ఒక దేశానికి ఆరాం అని పేరు ఉండేది. దాని ఇప్పటి పేరు ఏమిటి?
10. ఆఫ్రికాలో అత్యంత విశాలమైన సరస్సు ఏది?
11. ప్రాచీన బాబిలోనియాలోనూ, ఈజిప్టులోనూ 'బ్యాంకింగ్' పద్ధతి ఉండేది. ఆధునిక 'బ్యాంకింగ్' విధానం ఎక్కడ ఆరంభమయింది?
12. మొట్టమొదట క్రైస్తవ మతాన్ని పుచ్చుకున్న రోమన్ చక్రవర్తి ఎవరు?
13. వ్యోమనౌక నుంచి వెలుపలికి వచ్చి, అంతరిక్షంలో నడిచిన మొట్టమొదటి వ్యక్తి ఎవరు?
14. 'చండీఘడ్' నగరాన్ని రూపొందించిన వారు ఎవరు?
15. ఇప్పటి 'ఇండస్' నది సంస్కృతనామం ఏది?

# సమాధానాలు

1. యముడు.
2. థియొడోర్ రూజ్వెల్ట్.
3. ఏడువేల దీవులు.
4. విక్టోరియా రాణి. 63 సంవత్సరాలు (1837 - 1901).
5. ఐదవ కింగ్ జార్జ్.
6. హార్వర్డ్ విశ్వవిద్యాలయం (1636).
7. అలెగ్జాండర్ పార్క్స్.
8. ఇస్తాన్‌బుల్.
9. సిరియా.
10. విక్టోరియా సరస్సు.
11. ఇటలీ.
12. కాన్‌స్టాంటైన్ చక్రవర్తి.
13. అలెక్సీ లియొనోవ్. 1965వ సం॥లో.
14. ఫ్రెంచ వాస్తువేత్త లే కార్బూసియర్.
15. సింధునది.




సదానందం అనేవాడు ఎన్నో విద్యలు నేర్చాడు. కానీ, ఎందులోనూ రాణించక, తల్లిదండ్రులిచ్చిన పొలాన్ని సాగుచేసుకుంటూ రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు.

ఒకరోజున సదానందుడికి విద్యలు నేర్పిన గురువు, వాణ్ణి చూడ్డానికి వచ్చి చక్కగా వ్యవసాయం చేసుకుంటున్నాడని సంతోషించాడు.

అయితే, సదానందుడు మాత్రం అసంతృప్తిగా, "గురువర్యా! మీరు నేర్పిన విద్యలు నాకెందుకూ పనికిరాలేదు. లేకుంటే నేను, నాకు ఆసక్తిలేని వ్యవసాయం చేపట్టి వుండే వాణ్ణి కాదు," అన్నాడు.

గురువు నవ్వి, "నీకు కాస్త మతిమరుపు వుంది, మరే వృత్తి చేపట్టినా నిన్నెవరో ఒకరు మోసగించే ప్రమాదం వుంది. వ్యవసాయమే నీకు తగిన వృత్తి!" అన్నాడు.

"నా జ్ఞాపకశక్తి చాలా గొప్పది. అసలు లోపం నాలోకాక, మీరు నేర్పిన విద్యలో వున్నదని నా నమ్మకం," అన్నాడు సదానందం మొండిగా.

"అయితే, నేను నేర్పిన విద్యల సారాంశాన్ని చిన్న పుస్తకంలో నీకు రాసి ఇచ్చాను గదా! దాన్ని తీసుకురా," అన్నాడు గురువు.

"దానివల్ల నాకే ప్రయోజనమూ కనబడక, నా స్నేహితుడికిచ్చాను," అన్నాడు సదానందం.

"అయ్యో! అదుంటే నేను నీకు ఎంతో సాయపడగలిగేవాణ్ణి. ఆ పుస్తకమింక తిరిగి రాదు. పుస్తకం వనితా విత్తం పరహస్తం గతం గతః, అన్న విషయాన్ని మరిచిపోయావా?" అని అడిగాడు గురువు.

అందుకు సదానందం గర్వంగా నవ్వి, "అన్నీ నాకు గుర్తున్నాయి. అంతేకాక, ఎవరికైనా ఇచ్చిన వస్తువు తిరిగి తీసుకునేందుకు, మీరు చెప్పిన చతురోపాయలు కూడా నాకు గుర్తున్నాయి. ఎప్పుడు కావాలన్నా ఆ పుస్తకాన్ని తిరిగి తీసుకోగలను" అన్నాడు.

"వసుంధర"



"అయితే నాలుగు రోజుల్లో నేను మళ్ళీ వస్తాను. ఈలోగా ఆ పుస్తకం సంపాయించి వుంచు," అని గురువు వెళ్ళిపోయాడు.

ఆరోజే సదానందం, శ్రీధరుడనే తన స్నేహితుడింటికి వెళ్ళి, "నా గురువు సకల విద్యాసారాన్ని క్లుప్తంగా ఒక చిన్న పుస్తకంలో రాశాడు. అది నేనే నీకిచ్చాను గదా! ప్రస్తుతం నాకా పుస్తకంతో అవసరం వచ్చింది. నువ్వు దాన్ని తిరిగిస్తే, నీ పుస్తకాన్నే నాకిచ్చినట్లు భావించి, కొన్నాళ్ళుంచుకుని తిరిగి నీకిచ్చేయ గలను," అని చెప్పాడు.

శ్రీధరుడు కాసేపాలోచించి, "నాకు కాస్త మతిమరుపు. నీదగ్గరలాంటి పుస్తకం తీసు కున్నట్లే నాకు గుర్తు లేదు. ఈ రోజంతా వెతికి చూసి రేపు ఏ విషయమూ చెబుతాను," అన్నాడు.

సరేనని సదానందం మర్నాడు మళ్ళీ శ్రీధరుడింటికి వెళ్ళాడు. శ్రీధరుడు దిగులుగా ముఖం పెట్టి, "ఆ పుస్తకం ఎంత వెతికినా దొరకలేదు. నన్ను మన్నించు!" అన్నాడు.

"అలా కాదు! బాగా గుర్తు చేసుకో. అది ఎవరికో ఇచ్చి మరిచిపోయుంటావు. ఆ పుస్తకంలో ఒక నిధి సంపాయించే రహస్య ముంది. అది నాకు తప్ప ఎవరికీ తెలియదు. నువ్వు నాకా పుస్తకం సంపాయించి ఇచ్చా వంటే, నిధిలో నీకూ కొంత వాటా ఇస్తాను," అన్నాడు సదానందం.

ఈ మాటలు శ్రీధరుడి భార్య కూడా విన్నది. ఆ రోజంతా ఆ పుస్తకం గురించి వెతకడంలోనూ, ఎవరికిచ్చామా అని గుర్తు చేసుకోవడంలోనూ, ఆమె కూడా భర్తకు సాయపడింది. కానీ ప్రయోజనం కలగలేదు. పుస్తకం దొరకలేదు. ఎవరికిచ్చినదీ గుర్తుకు రాలేదు.

మర్నాడు తన రెండో ఉపాయం కూడా ఫలించలేదని తెలిశాక, సదానందుడు మూడో ఉపాయంగా, శ్రీధరుడి ఇంట్లో పనిమనిషిగా వుండే సీతమ్మను పిలిచి, ఆమెకు రహస్యంగా ఏదో చెప్పాడు.

అతడు చెప్పిన ప్రకారం, శ్రీధరుడు ఇంట లేని సమయంలో సీతమ్మ, శ్రీధరుడి భార్యతో, "అమ్మగారూ! అయ్యగారా పుస్తకాన్ని

చింతలతోపులో వుండే సూరమ్మకిచ్చారు. ఆ సంగతి మీకు చెప్పడానికి భయపడుతున్నారు. ఎలాగో అలా ఆ పుస్తకాన్ని సూరమ్మ దగ్గర్నుంచి సంపాదించి సదానందం గారికిస్తే మీకు నిధిలో వాటా వస్తుంది," అని సలహా ఇస్తున్నట్లు చెప్పింది.



సూరమ్మ ఆ ఊరి గణాచారి. చేతబడులు చేస్తుందనీ, మంత్రతంత్రాలు ప్రయోగిస్తుందనీ చాలామంది నమ్మకం. అలాంటి దానికి తన భర్త పుస్తకం ఇచ్చాడని విని, శ్రీధరుడి భార్య భర్త మీద అలిగింది. శ్రీధరుడు తనకేంతెలియదని ఎంత మొత్తుకున్నా ఆమె వినలేదు.

వేరే దారి తోచక శ్రీధరుడు, సదానందం ఇంటికి వెళ్ళి, తన పరిస్థితి చెప్పుకుని, "నీ పుస్తకం మా దంపతుల మధ్య గొడవలు తెచ్చి పెట్టింది. నువ్వే కాస్త పూనుకుని మా కాపురం నిలబెట్టు," అన్నాడు.

అప్పుడు సదానందం కోపంగా, "నా పుస్తకం నాకు ముఖ్యం! నీ కాపురం ఏమైపోయినా నాకు బాధ లేదు. ఈ సూర్యాస్తమయం లోపల, నా పుస్తకం నాకివ్వకపోతే కొండయ్యను మీ ఇంటికి పంపుతాను," అన్నాడు.

కొండయ్య పెద్ద వస్తాదు! కండలు తిరిగిన దేహంతో, మెలితిరిగిన గుబురు మీసాలతో బకాసురుడి చిన్నతమ్ముడిలా వుంటాడు. వాడు సదానందానికి ప్రాణస్నేహితుడు. ఆ వస్తాదు తన ఇంటి మీదికి ఏ క్షణాన్నయినా వచ్చి పడతాడన్న భయంతో, శ్రీధరుడు పొరుగూరిలో వున్న బంధువుల ఇంటికి పారిపోయాడు.

ఈలోగా నాలుగు రోజులూ గడిచిపోయాయని, సదానందం గురువు తిరిగివచ్చి, వాడిని పుస్తకం గురించి అడిగాడు.

"శాయశక్తులా ప్రయత్నించాను, గురువర్యా! అయినా ఆ పుస్తకం సంపాదించడం నావల్ల కాలేదు," అన్నాడు సదానందం నిరుత్సాహంగా.

"నేను ముందే చెప్పాను! పుస్తకం వనితా విత్తం పరహస్తం గతం గతః. అంటే — పుస్తకాన్నీ, స్త్రీనీ, డబ్బునూ ఇతరులకిస్తే, అవి

మళ్ళీ మనకు తిరిగిరావని. ఈ విషయం మరిచిపోయావు నువ్వు," అన్నాడు గురువు నిరసనగా.

"గురువర్యా! అస్తమానూ నేను మరిచిన విశేషం గురించే చెబుతారు తప్ప, తమరు చెప్పిన చతురోపాయాలనూ ఎంత చక్కగా జ్ఞాపకం వుంచుకున్నానో గ్రహించరేం?" అంటూ శ్రీధరుడి విషయంలో, తను సామ దాన భేద దండోపాయాలను ఏవిధంగా ప్రయోగించినదీ, పూసగుచ్చినట్లు చెప్పాడు సదానందం.

"ప్రయోజనం పొందడం చేతకానివాడెన్ని విద్యలు ప్రయోగించినా వ్యర్థమే!" అన్నాడు గురువు నిట్టూర్చి.

"నేను చేతకానివాడిననకండి. లోపం మీరు నేర్పిన విద్యల్లో వుంది," అన్నాడు సదానందం ఉక్రోషంగా.

ఇందుకు గురువు చిన్నగా నవ్వి, "ఒరే, నందం! ఈ నాలుగు రోజులూ నేను పొరుగూరులో వున్నా కదా! అక్కడ నా విద్యల వల్ల సకల ప్రయోజనాలు పొంది ఎంతో సుఖంగా వున్నవాడు, నాకు ఘన సన్మానం చేశాడు. నువ్వు చేతకానివాడివీ, మతిమరుపు వాడివీ అనడానికి, వాడే ఒక సాక్ష్యం!" అన్నాడు.

"ఎలా?" అని అడిగాడు సదానందం ఆశ్చర్యపోతూ.

"ఏ పుస్తకం వల్ల నువ్వు ప్రయోజనం పొందలేకపోయావో, ఆ పుస్తకంతో వాడు అన్నీ సాధించాడు. అందుచేత వాడు చేతనైన వాడు; నువ్వు చేతకానివాడివి. అయితే వాడు నా శిష్యుడు కాడు. ఆ పుస్తకాన్ని నువ్వే వాడికిచ్చావు. వాడు నీ స్నేహితుడు! పేరు శ్రీకరుడు. పుస్తకాన్ని శ్రీకరుడికిచ్చి ఆ విషయం మరిచిపోయి, శ్రీధరుడి మీద ఉపాయాలు ప్రయోగిస్తే మాత్రం, నీ పుస్తకం నీ చేతికి తిరిగి వస్తుందా?" అన్నాడు గురువు కాస్త కోపంగా.

సదానందం సిగ్గుతో తలవంచుకుని, గురువుకు, శ్రీధరుడికి క్షమార్పణ చెప్పుకుని అటుపైన అసంతృప్తి లేకుండా వ్యవసాయం చేసుకోసాగాడు.





# తీరుబాటు ఆలోచన!

కాంతయ్య మధ్యాహ్న భోజనం ముగించి, విశాలమైన తన ఇంటి ముంగిట అరుగుపై తీరుబాటుగా కూర్చున్నాడు. తీరుబడిగా వున్న వాడి బుర్రలో భూతాలు చిందులు వేస్తూంటా యని అంటారు! కాంతయ్య స్థితికూడా అదే విధంగా వున్నది. బుర్రలో వింత వింత ఆలోచనలు మొలకలెత్తసాగాయి.

ఇంతలో, ఆయన ఎరగని మనిషి ఒకడు, కాంతయ్య ఇంటిముందుకు వచ్చాడు. వాడి వాలకం చూస్తూంటే, ఎంతో దూరం నుంచి చాలా వ్యయప్రయాసలు పడి వచ్చిన వాడని తెలుస్తున్నది. వాడు తిన్నగా కాంతయ్యను సమీపించి, "అయ్యా! కాంతయ్యగారి ఇల్లు ఇదేనా?" అని అడిగాడు ఎంతో వినయంగా.

అంతవరకు తన బుర్రలో తొలుస్తున్న ఒక వింత ఆలోచనను, అమలులో పెట్టదలచిన కాంతయ్య అడ్డంగా తలతిప్పుతూ, "కాదు!" అంటూ బదులిచ్చాడు.

"కాదా?" అంటూ అయోమయంగా అడిగాడు, ఆ వచ్చినవాడు.

"కాదు. కాంతయ్య అన్నవాడి ఇల్లు ఊరుకు ఉత్తరంగా వున్న శివాలయం సమీపాన వున్నట్టు గుర్తు. అక్కడికి వెళ్ళు," అన్నాడు కాంతయ్య.

సరేనంటూ, వచ్చినవాడు ఉత్తర దిక్కుగా సాగిపోయి, గంట తర్వాత తిరిగి కాంతయ్య దగ్గిరకు వచ్చి, "అయ్యా! మీరు చెప్పిన గుర్తుల ప్రకారం శివాలయ ప్రాంతాల విచారించాను. అక్కడ కాంతయ్య పేరుగల వాళ్ళెవరూ లేరు. ఎవరిని విచారించినా, ఆయన ఇల్లు ఇక్కడేనని చెబుతున్నారు," అన్నాడు.

"అలాగా! తెలిసీ తెలియని వాళ్ళు. వాళ్ళు చెప్పడానికేముంది. కాని, ఇది కాంతయ్య ఇల్లు మాత్రం కాదు. ఇదిగో, ఈ దారి వెంట బాగా ముందుకుపో. చెరువుగట్టు, మర్రి చెట్టు తగులుతాయి. అక్కడ అడిగిచూడు," అన్నాడు కాంతయ్య.

వారణాశి శ్రీరామకృష్ణ



సత్రం వైపు వెళ్ళిన అపరిచితుడు, గంట తర్వాత కాళ్ళీడ్చుకుంటూ కాంతయ్య దగ్గిరకు వచ్చి, "మీరు చెప్పిన సత్రం వద్ద కాంతయ్య అన్న వారెవరూలేరు. అందరూ, ఆ ఇల్లు ఇక్కడేనని చెప్పారు," అన్నాడు నీరసంగా.

"అంతా విచిత్రంగా వుందే!కాని, కాంతయ్య ఇల్లు మాత్రం ఇది కాదు.సత్రం దగ్గిర వుండే కాంతయ్య మరొకసారి ఇల్లు మారనున్నాడని, ఎవరో అనగా విన్నాను. అయితే మళ్ళీ ఇల్లు మారినట్టుంది. ఇలా దక్షిణ దిక్కుగా వెళితే చింతలతోపు తగులుతుంది, అక్కడ వాకబు చెయ్యి," అన్నాడు కాంతయ్య.

కాంతయ్య ఇంటి కోసం వెతుకుతూ, చింతలతోపుకు వెళ్ళిన అపరిచితుడు నిస్సత్తువగా అడుగులు వేస్తూ మళ్ళీ కాంతయ్య దగ్గిరకువచ్చి, "అయ్యా! ఆ చింతలతోపు వద్ద దయ్యాలు తప్ప మనుషుల నివాసాలు వున్నట్టు కనిపించదు. పొలాలలో పనిచేసుకుంటున్న వారిని కూడా విచారించాను. వాళ్ళు కాంతయ్య ఇల్లు ఇక్కడేనని చెప్పారు. కాని మీరేమో కాదు, కాదు అంటున్నారు. ఏం చేసేది? కాంతయ్యగారి ఇంటి కోసం ఇంకా వెతకటం అన్నది, నావల్ల కాని పని, వెనుదిరిగి వెళ్ళిపోతాను," అంటూ ముందుకు కదిలాడు.

కాంతయ్యకు ఇక తన ఆట ముగించ బుద్ధి వేసింది. "ఏమిటీ! ఊరి నాలుగు దిక్కులా ఎవరినడిగినా కాంతయ్య ఇల్లు ఇదేనని చెప్పారా? నిజమేమరి, నేనేకదా కాంతయ్యను!

కాంతయ్య చూపిన దారి వెంట వెళ్ళిన అపరిచితుడు, కొంతసేపటికి మళ్ళీ తిరిగి వచ్చి, "అయ్యా! చెరువుగట్టు ప్రాంతంలో కాంతయ్య అన్నవారే లేరు. ఎవరినడిగినా, ఇల్లు ఇక్కడేనని చెబుతున్నారే?" అన్నాడు.

కాంతయ్య చిరునవ్వుతో, "బలే వాడివి దొరికావులే! నువ్వేమని అడుగుతున్నావు? వాళ్ళేమని చెబుతున్నారు? ఇది మాత్రం కాంతయ్య ఇల్లు కానే కాదు. చెరువు గట్టున వుండే కాంతయ్య, ఇల్లు మారతానని చెప్పిన గుర్తు. అయితే మారిపోయాడన్నమాట! ఇక నేం, తిన్నగా పడమటి దిక్కుగా సాగిపో. గ్రామ సత్రం వస్తుంది. అక్కడ విచారించు, పో!" అంటూ వాడిని పంపేశాడు.

ఇదే కదా నా ఇల్లు! మరి, నువ్వు వచ్చిన పనేమిటో చెప్పు?" అని అడిగాడు నింపాదిగా.

ఇది విని, వచ్చినవాడు వచ్చే కోపాన్ని అణుచుకుంటూ, "అయ్యా! కాంతయ్యగారు మీరే అయివుండికూడా చెప్పక, నన్ను ఊరంతా తిప్పించారు. కారణం ఏమిటి?" అని అడిగాడు.

"ఓం, అదా!" అంటూ కాంతయ్య తేలిగ్గా నవ్వేసి, "ఈ ఊరిలో నేను, నా పేరు, నా ఇల్లు ఎందరికి తెలుసునో తెలుసుకోవాలన్న దివ్యమైన ఆలోచన కలిగింది. సమయానికి నువ్వు దొరికావు! నీ అనుభవాన్ని బట్టి చూస్తే, ఊరి నలుమూలలా నేనంటే ఎరగనివారు లేరని తెలుస్తున్నది. భేష్, నాకున్న పేరు ప్రతిష్ఠలు చూసుకుంటూంటే, నాకింతంతనరాని గర్వకారణంగా వున్నది. సరే, ఇక ఇప్పుడు, నువ్వు వచ్చిన పనేమిటో వివరించు," అన్నాడు.

వచ్చినవాడు నిలువునా ఊగిపోతూ గొంతు పెగుల్చుకుని, "అయ్యా! నేను జనార్దనపురం నుంచి మీ కోసం ఒక అత్యవసరమైన కబురు మోసుకు వచ్చినవాణ్ణి! కోటీశ్వరుడైన మీ బంధువు శ్రీకంఠుడికి, ఈ ఉదయం అకస్మాత్తుగా గుండెపోటు వచ్చింది. ఆ తర్వాత కొద్దిసేపటికే ఆయన మరణించాడు. ఆయనకు భార్యా పిల్లలు ఎవరూ లేరన్న సంగతి మీరెరిగిందే కదా? అందువల్ల, ఆయన మరణించే ముందు మిమ్మల్నీ, మరి ఇద్దరు దాయాదుల్నీ గుర్తు చేసుకుని, తన మరణవార్త మీకు అందించవలసిందనీ, మీలో ఎవరు ముందుగా వచ్చి, తన చితికి నిప్పంటించి, అంతిమ సంస్కారాలు జరిపిస్తారో — వారికి తన యావదాస్తి చెందాలనీ చెప్పి కన్ను మూశారు. నేను వారిదగ్గర పనివాడిని. ఈ కబురు మీకు వేగంగా చేర్చి మీ మెప్పును, బహుమానాన్ని పొందాలని ఆశించి వాయు వేగంతో వచ్చాను. చివరికి ఇలా అయింది! మనం తక్షణం బయలుదేరి వెళ్ళినా ఫలితం వుండబోదు. మిగిలిన, వారి దాయాదులిద్దరిలో ఎవరో ఒకరు, ఈసరికి ఆ కర్మకాండ అంతా ముగించి వుంటారు!" అన్నాడు కళ్ళనీళ్ళతో.

తీరుబాటుగా కూర్చుని చేసిన ఆలోచనను అమలులో పెట్టినందువల్ల కలిగిన ఫలితాన్ని చూసి, కాంతయ్య నెత్తీ నోరూ బాదుకున్నాడు.



## తల్లితండ్రులూ, జాగ్రత్త!

పిల్లలు ఉన్నత పాఠశాల చదువు పూర్తి చేయకుండా మధ్యలోనే మానేస్తే, శిక్ష పిల్లలకు కాదు; తల్లితండ్రులకు! ఈ చట్టం మన దేశంలో కాదు; చైనాలో! చైనాలో ఉన్నత పాఠశాల స్థాయి వరకు విద్య ఉచితం, నిర్బంధం కూడా! పిల్లలు మధ్యలో చదువు మానేస్తే వాళ్ళు చదివే తరగతిని బట్టి తల్లి తండ్రులకు 100 రూపాయల నుంచి, 1,70,000 వరకు జరిమానా విధిస్తుంది ప్రభుత్వం. పిల్లలకు ఆరేళ్ళ వయసు రాగానే బడిలో చేర్చుకుంటారు. ఆ తరవాత తొమ్మిదేళ్ళలో ఉన్నత పాఠశాల విద్య పూర్తవుతుంది. రాజధాని బీజింగ్‌లో 99.98 శాతం పిల్లలు పాఠశాలలకు వెళుతున్నారు!

## రక్షించిన పాపాయి పొదుపు!

ఉత్తర జపాన్‌లోని సప్పోరో పట్టణంలో ఈ సంఘటన జరిగింది. ఎవరో తలుపు తడుతున్న చప్పుడయితే, ఆ ఇంటి ఇల్లాలు వెళ్ళి తలుపు తీసింది. మరు క్షణమే లోపలికి జొరబడిన దొంగ, ఉన్నదంతా



తెచ్చి ఇవ్వు, లేకుంటే చంపేస్తాను, అని కత్తి చూపి బెదిరించాడు. ఆ ఇల్లాలు భయంతో ఏమీ మాట్లాడలేక పోయింది. అక్కడే వున్న ఆమె తొమ్మిదేళ్ళ కూతురు దొంగను ఏమీ చేయవద్దని చెప్పి లోపలికి వెళ్ళి తాను అంతవరకు కూడబెట్టిన 17,000 యెన్ (4,500 రూ॥) తెచ్చి దొంగ ముందు కుమ్మరించింది. దొంగ ఆ డబ్బు తీసుకుని పారిపోయాడు!

## అతి స్థూల శరీరం

అమెరికా, ఫ్లోరిడాలోని ఫోర్ట్‌లాడర్ డేల్‌కు చెందిన ఒక స్త్రీకి కాలి మీద దెబ్బ తగిలి పుండై ప్రాణాపాయ స్థితి కలిగింది. చికిత్స కోసం ఆస్పత్రికి తీసుకుపోవడానికే కష్టమైపోయింది. కారణం ఆమె స్థూలకాయం. ఆమె 320 కి॥ గ్రా॥ బరువున్నది. ఇంటి నుంచి బయటకు తీసుకురావాలంటే ద్వారం పట్టలేదు. ఆఖరికి ఆ ద్వారాన్ని పగల గొట్టవలసిన పరిస్థితి ఏర్పడింది పాపం!

## ముప్ఫైయేళ్ళ బొమ్మ

1945వ సం॥లో అమెరికా హిరోషిమా, నాగసాకిల మీద అణుబాంబులు వేసిన తరవాత రెండవ ప్రపంచ యుద్ధం ముగిసింది. అమెరికా సైనికులను 'జిఏస్' అని పిలిచేవారు. 1964వ సం॥లో బొమ్మలు తయారుచేసే ఒక సంస్థ 'జిఏ జో' అనే పేరుతో ఒక సైనికుడి బొమ్మను తయారుచేసింది. ఆ బొమ్మ పిల్లలను ఎంతగానో ఆకర్షించింది. ఆ బొమ్మ తయారీ ముప్ఫై ఏళ్ళుగా కొనసాగుతున్నది. ఇంత వరకు 220,000,000 బొమ్మలు అమ్ముడయ్యాయి. ఫిబ్రవరి 7వ తేదీ ఆ తయారీ సంస్థ ఆ బొమ్మకు పుట్టినరోజు వేడుకలను ఎంతో ఘనంగా ఏర్పాటు చేసింది. ఆ వేడుకలకు వచ్చిన వాళ్ళను 18 మీటర్ల (60అడుగుల) ఎత్తు గల గంభీరమైన 'జిఏ జో' ఆహ్వానించాడు!





# వీరహనుమాన్

పాండవులు జూదంలో కౌరవులకు ఓడి వనవాసం చేస్తున్నారు. ద్రౌపది భీముడితో వనవిహారం చేస్తూ, అహ్లాదకరంగా ఉన్న ఒక ప్రదేశంలో చదునుగా వేదికలాగ ఉన్న స్ఫటికశిలపై కూర్చొని, దూరంగా కనిపిస్తున్న హిమగిరి శిఖరాల సొగసులు తిలకిస్తూన్నది. ఆ సమయంలో పెద్ద గాలి వీచింది. ఆ గాలిలో అపూర్వమైన పెద్ద పువ్వు కొట్టుకొని వచ్చి ద్రౌపది ఒడిలో పడింది. ఆ ప్రదేశమంతా దాని పరిమళంతో గుబాళించిపోయింది. దాని రేకులు ఎంతో అందంగా లెక్కకు మిక్కిలిగా ఉన్నవి. అది కొంచెం నలిగి ఉన్నది.

అది సౌగంధికా కమలం. కుబేరుడి పట్టణమైన అలకాపురి దాపున మానసరోవరంలో కలిసి ఉన్న దళసరోవరంలో రోజుకు ఒకటి మాత్రమే వికసిస్తూంటుంది. కుబేరుడు ప్రతిరోజూ పుష్పక విమానం మీద కైలాసానికి వెళ్ళి సౌగంధికా పుష్పంతో శివార్చన చేసి, క్రితం రోజు అర్పించిన పువ్వును శివ నిర్మాల్యంగా తన నగరానికి తీసుకెళ్తూంటాడు. అలాంటిదే పుష్పకం నుంచి జారి, ఆకాశం నుంచి గాలిలో కొట్టుకొని వచ్చి, ద్రౌపదికి దొరికింది.

ద్రౌపది అచ్చెరువుతో ఆ పుష్పాన్ని చూసి ముచ్చటపడుతూ, అలాంటి పుష్పాన్ని కొత్తది తెచ్చిపెట్టమని భీముడిని అప్యాయంగా కోరింది. భీముడు గదను భుజాన వేసుకొని వెతుకుతూ వెళ్ళి వెళ్ళి హిమాలయ సానువులో ఉన్న కదళీవనం ప్రవేశించి నడుస్తున్నాడు. ఆ వనంలోనే హనుమంతుడు పెద్ద అరటి చెట్టు బోదెను పండుముసలి రూపంలో ఆనుకొని కాళ్ళుచాచి కూర్చొని, రామస్మరణ చేస్తున్నాడు. అతని తోక చాలా దూరం వరకూ దారికడ్డంగా పడి ఉన్నది. భీముడు దాన్ని ఒక కోతి తోకగా గుర్తించి, దాటుకొని వెళ్ళ



గట్టిగా నొక్కిపట్టి కదిలించాలని విశ్వ ప్రయత్నం చేసినా, ఏమాత్రం లాభం లేక పోయింది.

హనుమంతుడు విసుక్కుంటూ, "ఏమిటి నాయనా, గుప్పెటపట్టి, నొక్కి నొక్కి చంపు తున్నావు? ఒక ముసలి కోతిగాడి తోకను నెట్టలేకపోతున్నావే, ఏం ఘనకార్యం సాధిద్దా మని పెద్ద గద పట్టుకొని మరీ బయలు దేరావు? మీ కుర్రాళ్ళకి తొందరపాటేగాని ఆలోచన ఉండదు. అందులోనూ ప్రియమైన ఆడదాని కోరిక తీర్చడానికి మరీ తొందరా, ఎక్కడలేని చురుకూ వస్తుంది. అయినా నీ విషయం అటువంటిదేమీ కాదు గద?" అన్నాడు.

డానికి రాజసం అడ్డువచ్చి, చుట్టూరా కలయ జూశాడు. రామరామ అనుకుంటూ కునుకు పాట్లు పడుతూన్న హనుమంతుడు అతడికి కనిపించాడు. వెంటనే భీముడు నేల అది రేలా అడుగుల చప్పుడు చేస్తూ బెదిరిం చాడు.

హనుమంతుడు ఆయాసంగా వగరుస్తూ, "నాయనా! పండు ముదుసలిని, ఓపిక లేదు. నువ్వే దాన్ని కాస్త పక్కకు నెట్టుకొని వెళ్ళు. నామీద కనికరించి కాస్త శ్రమపడు!" అన్నాడు.

భీముడు గదనువాల్చి తోకను తోశాడు. అది కొంచెమైనా జరగలేదు. వంగి చేత్తో తోశాడు. రెండు చేతులతో సత్తువ పూరా

భీముడు ఉడికిపోయి, "అధికప్రసంగం కట్టిపెట్టు!" అంటూ హనుమంతుడిని గదతో కొట్టబోయాడు.

హనుమంతుడు నవ్వుతూ, "ఓహెూ! గదా యుద్ధానికి పిలుస్తున్నావా? ఇన్నాళ్ళు సాము నేర్చి మూలనున్న ముసలివాడితోనా యుద్ధా నికి దిగావు? నీలాంటి తమ్ముళ్ళుంటే అన్న లకు అరణ్యవాసాలే గతి! నాకూ ఉందిలే ఒక గద; నాతోబాటే అదీ ముసలిదైపోయింది!" అని చెబుతూ దూరంగా ఉన్న తన గదను చేయి చాచి అందుకోబోతే అందక, "కాస్త నా గదను అందియ్యి తమ్ముడూ, గదా యుద్ధం చేయమంటున్నావుగా మరి!" అన్నాడు.



భీముడు ఆ గదను ఎత్తి అందియ్య డానికి ఆయాసపడుతూంటే హనుమంతుడు, “మా కాలంలో ఇలాటి గదలే గాని, గుల్ల గదలూ, రేకు గదలూ ఎరగం. ఇంకా వెన కటి కాలంలో బండరాతి గదలే వాడేవాళ్ళం!” అంటూ గదను అందుకుని బెండులాగ ఎత్తి, భీముడి నెత్తిమీద ఆశీర్వదిస్తున్నట్టుగా సుతారంగా మోపాడు. భీముడు బాధతో మూలుగుతూ తన గదతో హనుమంతుణ్ణి కొట్టాడు.

హనుమంతుడు దిగ్గున లేచి గదను ఎత్తి పట్టుకొని హుంకరించాడు. కదళీవనం దద్దరిల్లింది.

ఇద్దరూ చాలాసేపు గదా యుద్ధం చేశారు. భీముడి గద పట్టు తప్పి దూరానికి తూలి పడింది. హనుమంతుడూ తన చేతిలోని గదను విసిరేసి భీముడితో మల్లయుద్ధానికి తొడ చరిచాడు.

ఇద్దరూ మల్లయుద్ధం చేస్తూండగా భీము డికి ఒక విషయం బోధపడింది. హనుమం తుడు తలచుకొంటే భీముణ్ణి చిత్తు చేసి ఏం చేసినా చేయగలడు. కాని హనుమం తుడు గదా యుద్ధంలోనూ, మల్లయుద్ధం లోనూ తనకు తెలియని మెళుకువలన్నీ గురువు శిష్యుడికి నేర్పుతున్నట్లుగా యుద్ధం చేసి చూపించాడు.

భీముడు చప్పున హనుమంతుడి ముందు మోకరిల్లి, “మహానుభావా, తెలుసుకున్నాను! నువ్వు హనుమంతుడివే! నేను వాయుదేవుడి వరప్రసాదుణ్ణి, కుంతి కుమారుణ్ణి! ధర్మరాజు పెద్ద తమ్ముణ్ణి, భీముణ్ణి! అనుగ్రహించు!” అని స్తోత్రం చేశాడు.

హనుమంతుడు భీముణ్ణి వాత్సల్యంతో రెండు చేతులతో లేవనెత్తి, “ఔను, తమ్ముడూ మనం ఇద్దరమూ వాయునందనులమే!” అన్నాడు నవ్వుతూ.

భీముడు, “నీ బ్రహ్మాండమైన రూపాన్ని చూడాలని ఉంది!” అన్నాడు.

“నాయనా! ఇది ద్వాపర యుగం, నా పూర్తి విశ్వరూపం నీవు చూడలేవు. నీ తృప్తి మేరకు చూపిస్తాను, చూడు!” అని శరీరాన్ని మేఘమండలాన్ని దాటిస్తూ పెంచి, తోకను




జాగ్రత్తపడు. గుర్తుంచుకో, ఆ యక్షిణి గొప్ప శివదీక్షాపరురాలు. నా రోమాల్ని గుప్పెడు పట్టుకెళ్ళు. యక్షిణి నిన్ను అడ్డగించి నప్పుడల్లా, ఒక రోమాన్ని దానిముందు వెయ్యి. రోమం పడ్డ చోట శివలింగం లేస్తుంది. యక్షిణి సహస్రనామాలతో దాన్ని అర్చిస్తూ కూర్చుంటుంది. ఆవిధంగా నీ పని చక్కబెట్టుకొని రా!" అని చెప్పి హనుమంతుడు తన తోక కుచ్చునుంచి రోమాల్ని తీసి ఇచ్చి, భీముడికి అక్కడి నుంచి దళసరోవరానికి దారి చూపించాడు.

కేశికి దూరంలో వస్తూన్న భీముణ్ణి చూసి, వెంటనే ఎంతటివారినైనా సమ్మోహపరచగల అద్భుత సౌందర్యవతిగా రూపు దాల్చి, ఆట పాటలు మొదలు పెట్టింది. భీముడు సమీపించి పరవశించిపోయాడు. అప్పుడు రామ నామం అతని చెవిలో మారుమ్రోగింది. భీముడు తెలివి తెచ్చుకొని ముందుకు సాగాడు. ఎన్నివిధాలుగా కవ్వించినా భీముణ్ణి మాయాజాలంలో ముంచలేక యక్షిణి విసిగి, చివరకు భయంకరాకారంతో అతణ్ణి అడ్డగించింది.

ఎత్తి ఆకాశాన్ని చుట్టుతూ హనుమంతుడు భీకరంగా గర్జించాడు.

భీముడు అదిరిపడుతూ ఆ రూపాన్ని చూడలేకపోయాడు. విశ్వరూపాన్ని ఉపసంహరించుకోమన్నాడు.

హనుమంతుడు తగ్గి, "ఇంతకూ నీవు బయలుదేరిన పని చెప్పావే కాదు!" అన్నాడు.

భీముడు చెప్పాడు.

"భీమసేనా! దళసరోవరాన్ని కేశికి అనే యక్షిణి కాపలా కాస్తూంటుంది. అది చాలా ప్రచండురాలు. దాని ముందర బల పరాక్రమాలు ఎందుకూ పనికిరావు. దాని మాయాజాలానికి లొంగని వారుండరు. నేను జపించే రామనామం నిన్ను హెచ్చరిస్తుంది. అప్పుడు

భీముడు హనుమంతుడి రోమాన్ని దాని ముందర వేయగానే సాక్షాత్కరించిన శివలింగానికి, కేశికి లెంపలు వేసుకొని సాగిలపడి అమిత భక్తితో మ్రొక్కి స్తోత్ర పారాయణ మొదలుపెట్టింది. దాని శివలింగ ఆరాధన పూర్తయ్యేలోగా భీముడు దళ సరోవరంలో



దిగి సౌగంధికా కమలాన్ని కాడతో త్రుంచి పట్టుకొని పలాయనమయ్యాడు. పూజ ముగించిన కేశికి ప్రచండ వేగంతో భీముణ్ణి వెంబడించింది. దాని జుట్టు అగ్నిశిఖల్లాగ గాలిలో విరజిమ్ముకుంటూ అతణ్ణి చుట్టుముట్టింది.

భీముడు దారి పొడవునా రోమాలు వేస్తూ భక్తురాలికి ఎడతెగని ఆరాధనా కాలక్షేపాన్ని కల్పిస్తూ దానినుంచి తప్పించుకొని, వేగంగా వెళ్ళి హనుమంతుడున్న కదళీవనాన్ని చేరుకున్నాడు.

భీముడు సౌగంధికాపుష్పాన్ని హనుమంతుడికి చూపిస్తూ, "మహానుభావా! ఇప్పుడు నీ అనుగ్రహంతో నాకు విజయం చేకూర్చినట్లే, మునుముందు కౌరవులతో మాకు జరగబోయే సంగ్రామంలో నీవు మాకు సహాయపడాలని మా పాండవులందరి పక్షానా వేడుకుంటున్నాను," అని భక్తితో చేతులు జోడించాడు.

అప్పుడు హనుమంతుడు, "భీముడా! నేను ఈ కాలంలో యుద్ధం చేయను. అడిగావు గనక సంగ్రామం జరుగుతున్నప్పుడు నీ తమ్ముడు అర్జునుడి రథంమీది పతాకాన్ని అంటిపెట్టుకుని రక్షగా ఉంటాను. మీకు జయం కలుగుతుంది! ఇక నీవు నిశ్చింతగా వెళ్ళి సౌగంధికను ద్రౌపదికి ఇచ్చి ముచ్చట తీర్చు. మాయలేడిని కోరి ఆనాడు సీత అన్ని అగచాట్లు తెచ్చి పెట్టుకొన్నది. ఇలాంటి కోరికలు కోరడం అంతమంచిది కాదని చెప్పానని చెప్పు. సౌగంధికా కమలాన్ని శివార్చన చేసి అలాగే ఉండనిచ్చి, తిరిగి కొప్పుముడి వేసుకున్నప్పుడు శివనిర్మాల్యంగా తీసి ధరించమని చెప్పు! శివార్చన చేసినందువల్ల మీకు శుభమూ, కుబేరుడి ఐశ్వర్యమూ కలుగుతాయి. సౌగంధికా కమలం ఎప్పటికీ వాడదు!" అని చెప్పి భీముణ్ణి ప్రేమతో ఆశీర్వదించి పంపాడు.

భీముడు సౌగంధికాకమలాన్ని తీసుకుని వెళ్ళి ద్రౌపదికిచ్చి ఆమెచేత శివార్చన చేయించాడు. హనుమంతుడు చెప్పమన్నది కూడా మరవకుండా చెప్పాడు.

ద్రౌపది అది విని సిగ్గుతో క్షణం ఊరుకొని, మందహాసం చేస్తూ, "నేను సౌగంధికను కోరి

నందువల్లనే కదా ఆ మహానుభావుడి రక్ష మనకు లభించింది! మంచే జరిగినది కదా?" అన్నది.

భీముడితో సహా పాండవులందరూ, "ఔను! ఔను!" అన్నారు.

హనుమంతుడి అనుగ్రహానికి వాళ్ళు మహదానందపడ్డారు.

పాండవులు నియమం ప్రకారం పన్నెండేళ్ళ వనవాసం ముగించి, తరవాత ఒక ఏడాది అజ్ఞాతవాసం విజయవంతంగా పూర్తి చేశారు. కృష్ణుడిని తమ పక్షాన రాజ్య భాగం కోరి కౌరవుల దగ్గరికి సంధి రాయబారానికి పంపారు.

కృష్ణుడు చెప్పిన హితవచనాలు దుర్యోధనుడు లెక్క చేయలేదు. ఆ తరవాత కురు పాండవుల మధ్య సంధి పొసగలేదు. యుద్ధం తప్పనిసరి అయింది. కురుక్షేత్రంలో రణదుందుభి మ్రోగింది. అర్జునుడి రథం మీద రెపరెపలాడుతున్న పతాకాన్ని హనుమంతుడు సూక్ష్మరూపంతో అంటి పెట్టుకొని ఎగిరాడు. కృష్ణుడు అర్జునుడి రథంతోలాడు. యుద్ధ రంగంలో ఉభయ సేనల మధ్య విజయ ధ్వజం ఉజ్వలంగా ఎగిరింది.

కురుక్షేత్రంలో మహాభారత సంగ్రామం బ్రహ్మాండంగా జరిగింది. కృష్ణుడు రథసారథిగా వుండి, గుర్రాలను అదలిస్తూ అర్జునుడి చేత దిగ్విజయంగా యుద్ధం చేయించాడు. అర్జునుడు శత్రువులను సంహరించి విజయుడుగా పేరు పొందాడు. కృష్ణుడు విజయసారథి అనిపించుకున్నాడు.



దుశ్శాసనుడు ద్రౌపది జుట్టుపట్టి సభకు ఈడ్చుకొని వచ్చినప్పుడు, అతడి రక్తంతో ద్రౌపది జుట్టు తడిపి ముడి వేస్తానని భీముడు ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. అలాగే యుద్ధంలో భీముడు దుశ్శాసనుడి రొమ్ము చీల్చి ఆ రక్తాన్ని ద్రౌపది జుట్టుకు రాశాడు. అప్పుడు ద్రౌపది కొప్పుముడి వేసుకొని సౌగంధికా పుష్పాన్ని తురుము కొన్నది. విజయధ్వజంగా ఉన్న హనుమంతుడికి, ఎంతో భక్తిశ్రద్ధలతో నమస్కారం చేసింది.

గదాయుద్ధంలో భీముడు దుర్యోధనుడి తొడలు విరగగొట్టాడు. భీముడు చేసిన ప్రతిజ్ఞలు నెరవేరాయి. అధర్మవర్తనులయిన కౌరవులు నిశ్శేషంగా హతులయ్యారు. ధర్మమార్గంలో నడిచిన పాండవులు విజయం పొందారు.

కృష్ణుడు హనుమంతుడిని అభినందించి, "హనుమంతుడా! నీ కార్య దీక్షతో ఆనాడు పరమ దుర్మార్గుడయిన రావణసంహారానికి రాముడికితోడుపడ్డావు. ఇప్పుడు కురుక్షేత్ర యుద్ధంలో విజయధ్వజంగా ఎగిరి ధర్మరాజుకు జయం చేకూర్చావు!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

అప్పుడు హనుమంతుడు వినయంగా, "మహారథుడైన అర్జునుడికి నువ్వు చక్రపాణివై సారథ్యం చేస్తూండగా జయం చేకూరక ఎక్కడికి పోతుంది? అయినా ముల్లోకాలలో క్రియాసిద్ధికి మించిన బలమేముంది! నేను కేవలం ఒక చిహ్నాన్ని మాత్రమే!" అని అన్నాడు.

"ఔను! క్రియాసిద్ధికి నీవు చిహ్నంగా ఉంటావు! ఏ కాలంలోనైనా, ఏ రంగంలోనైనా నీ గురుతు గల జండా విజయం చేకూరుస్తుంది. విజయధ్వజంగా కల కాలం కీర్తి పొందుతుంది!" అని కృష్ణుడు భరతవాక్యం పలికాడు.

పాండవులందరి వందనాలు అందుకొని, వారిని మనసారా ఆశీర్వదించి, కృష్ణుడి వద్ద సెలవు తీసుకొని హనుమంతుడు గంధమాదన పర్వతానికి ఎగిరివెళ్ళాడు. అక్కడి ప్రశాంత వాతావరణంలో రామనామ స్మరణతో తపస్సులో నిమగ్నుడయ్యాడు.





# కొత్తఅల్లుడి పాట్లు

కొత్త అల్లుడు కోటిలింగం, పెళ్ళయిన మూడు నెలల్లో ఐదుసార్లు రావడం తల నొప్పిగా తయారయింది గౌరమ్మకు. పెళ్ళయిన కొత్తల్లో దసరాపండగకు వచ్చిన అల్లుడు, "గారెలు అద్భుతంగా వున్నాయి, అత్తా! బూరెలు అమోఘం అనుకో!" అంటూ భోజనం చేస్తూ పొగిడినప్పుడు పొంగిపోయిందామె.

"నీ అల్లుడికి అరిసెలంటే ప్రాణం, అమ్మా! ఏడాది క్రితం వాళ్ళ బామ్మ పోయేంతవరకూ, ఎప్పుడూ ఆయన కోసం డబ్బా నిండా అరిసెలు చేసి వుంచేదట. ప్రతి రోజూ కునుకు తీసే ముందు నాలుగు అరిసెలు నమిలి మింగనిదే నిద్రపట్టదు, నీ అల్లుడికి!" అన్నది కూతురు కోమలి.

"ఏం చేస్తానే, తల్లీ! అన్నీ చేయడం వచ్చు గానీ, అరిసెలు చేయడం నాకు చేతకాదు గదా. వాటికోసం, ఆ సుబ్బమ్మ మీద ఆధార పడాలి," అంటూ బాధపడింది గౌరమ్మ.

కూతురు, అల్లుడు వెళ్ళేరోజు పెద్ద డబ్బా నిండా సుబ్బమ్మ చేత అరిసెలు చేయించి, వాళ్ళు ఎక్కిన బాడుగ బండిలో పెట్టింది గౌరమ్మ.

ఆరు పదుల అరిసెల్ని వారం తిరక్కుండానే తినేశాడు, కోటిలింగం. ఆ తర్వాత మూడు రోజులాగి, తన పుట్టింటి ప్రయాణానికి బండి మాట్లాడుకొచ్చిన భర్తతో కోమలి, "పది రోజుల కిందటేగదా దసరాకు వెళ్ళివచ్చాం! అప్పుడే మళ్ళీ వెళ్ళడం ఎందుకు?" అన్నది ఎంతో ఆశ్చర్యంగా.

"అట్టే మాట్టాడకు! ఈ రోజు ఆశ్వయుజ పున్నమి. సుబ్బమ్మగారితో అరిసెలు చేయించు కుని తినాలి," అంటూ హడావుడి చేశాడు కోటిలింగం.

అది మొదలు, పౌర్ణమి అనీ, ఏకాదశి అనీ, మాస శివరాత్రి అనీ — ఇలా ఏదో వంకన పెళ్ళయిన మూడు నెలల్లో ఐదుసార్లు అత్త

మాచిరాజు కామేశ్వరరావు



గారింటికి వెళ్ళి, సుబ్బమ్మ చేసిన అరిసెలు డబ్బాల నిండుగా పట్టుకు వెళ్ళాడు కోటి లింగం.

ఈసారి శని త్రయోదశి వంకతో అత్తవారింటికి వెళ్ళాడు కోటిలింగం.

"ఆ శని పీడ వదిలినా, ఈ అల్లుడిశని పీడ ఈజన్మకు విరగడయ్యేలా లేదు!" అంటూ విసుక్కున్నది, గౌరమ్మ.

ఆ మధ్యాహ్నం కొట్టు కట్టేసి భోజనానికి వచ్చిన కోమలి తండ్రి, భార్యను, "అల్లుడూ, అమ్మాయీ వెళ్ళేది, ఈ సాయంత్రమే కదా?" అని అడిగాడు.

"అరిసెలు మూట కట్టిస్తేనే గాని అల్లుడు అరుగు దిగడు. మన పనివాడు రంగడి చేతికి సరుకులన్నీ ఇచ్చి, ఇప్పుడే సుబ్బమ్మ దగ్గిరకు పంపిస్తాను. సాయంత్రానికి అరిసెలు సిద్ధమవుతాయి," అన్నది గౌరమ్మ కోపంగా.

"రంగడు పెళ్ళాంతో పొరుగూరు జాతరకు వెళతానంటే, ఇంతకుముందే వెళ్ళమన్నాను," అన్నాడు కోమలి తండ్రి.

"గొప్ప ఘనకార్యమే చేశారు! ముందు ఎవర్నయినా పంపి, ఆ రంగణ్ణి పిలిపించండి," అన్నది గౌరమ్మ.

కోమలి తండ్రి పంపిన మనిషి వెళ్ళి, రంగడితో, "నువ్వు సుబ్బమ్మగారి దగ్గర కూర్చుని అరిసెలు చేయించాలట! అమ్మగారు నిన్ను వున్నపళంగా రమ్మన్నారు," అని చెప్పాడు.

ఈ కబురు వింటూనే రంగడు కంగారుపడి పోయాడు. ఆ రోజు జాతరకు తప్పకుండా తీసుకువెళతానని, వాడు నాలుగు రోజులుగా భార్యను ఊరిస్తున్నాడు. ఈ అరిసెల కబురు తెలియగానే ఆమె అలిగి, తలలో పూలదండను విసిరికొట్టి, కట్టుకున్న కొత్త చీర విప్పేసి పాత చీర కట్టుకుని, గడప కడ్డంగా చాప పరుచుకుని పడుకున్నది.

చేసేది లేక ఉస్సూరుమంటూ యజమాని ఇంటికి వచ్చాడు, రంగడు. గౌరమ్మ ఒక సంచిలో నాన బెట్టిన బియ్యం, బెల్లం, ఒక గిన్నెలో నూనెపోసి వాడికిచ్చి, "జాగ్రత్త సుమా! అక్కడే కూర్చో. ఈ వంట వాళ్ళను వందకళ్ళ

తోకనిపెట్టి చూస్తూండాలి!" అని హెచ్చరిం చింది.

రంగడు, సుబ్బమ్మ ఇల్లు చేరేసరికి ఇల్లంతా పిల్లలతో సందడిగా వుంది.

సుబ్బమ్మ సంగతి విని, "మీ అమ్మగారు, నా చాకిరీకి ఎర్రఏగాణీ అయినా ఇవ్వరుగాని, వారానికోసారి అరిసెలు చేయిస్తారు! ఊరి నుంచి మా అక్క పిల్లలొచ్చారు. ఈ రోజు నాకు కుదరదు," అన్నది.

ఇది విని రంగడి గుండె జారిపోయింది. ఈ రోజు జాతరకు వెళ్ళడానికి సమయం దాటింది. రేపు ఈ అరిసెల వ్యవహారం పెట్టు కుంటే అసలు కుదరదు. జాతరకు రేపైనా తీసుకుపోకపోతే పెళ్ళాం అలిగి పుట్టింటికి వెళ్ళిపోవడం ఖాయం!

ఏవిధంగానైనా, ఈ అరిసెల పీడ వది లించుకోవాలని రంగడు అనుకుంటూండ గానే, వాడికి తిరుగులేని చక్కని ఆలోచన రానే వచ్చింది. వాడు, సుబ్బమ్మకు తన ఆలో చన చెప్పి, "ఇన్నాళ్ళూ శ్రమపడి అరిసెలు చేసినందుకు, నీకు కొంత డబ్బు ముడు తుంది. ఆ పైన అరిసెలు చేసే వెట్టిచాకిరీ కూడా తప్పుతుంది," అన్నాడు.

"అలాగే చేద్దాం!" అన్నది సుబ్బమ్మ సంతో షంగా.

ఆ రోజు అరిసెలు తయారుకావని రంగడి ద్వారా వింటూనే, కోటిలింగం ప్రయాణం వాయిదా వేసుకున్నాడు.



ఆ సాయంత్రం పెరట్లోని బావి పక్కనున్న మామిడి చెట్టు కింద కూర్చుని వున్న కోటి లింగంతో, రంగడు, "చిన్నయ్య గారూ! సుబ్బమ్మ మనకైతే అరిసెలు రేపుగాని చెయ్యనన్నది కానీ, అక్క పిల్లలకు మాత్రం ఎలాంటి అరిసెలు చేసి పెట్టిందనుకున్నారు! వాళ్ళు తింటూంటే, నాకే నోరూరి పోయింది. కరకర మనే చప్పుడు. నేతిలో వేయించిం దేమో, తేనె రంగులో ఘుమఘుమలాడుతు న్నాయి!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే కోటిలింగం నాలుక చప్పరించి, "నువ్వు చెప్పింది బాగానే వుంది. కానీ ఎవరింట్లోవో మన చేతికెలా దొరుకుతా యిరా?" అన్నాడు.



"వాళ్ళింటికి వెళదాం. పిల్లలు వేలం వెర్రిగా తింటున్నారని, సుబ్బమ్మ అరిసెల జాడీని అటక మీద పెట్టడం నేను కళ్ళారా చూశాను. చీకటిచాటున, ఆ జాడీలోని అరిసెలు కొన్ని తెచ్చుకుంటే సరిపోతుంది," అన్నాడు రంగడు.

"అదెలా సాధ్యం? అయినా కొత్తల్లుడిని, ఊళ్ళో అడ్డమైన వాళ్ళిళ్ళకూ వెళ్ళడం ఏం మర్యాద?" అన్నాడు కోటిలింగం కాస్తసంకోచంగా.

"అరిసెల విషయంలో, ఈ పట్టింపులేమిటి, చిన్నయ్యగారూ? మీ అత్తగారు అరిసెలు చేసినందుకు సుబ్బమ్మకు కానీ విదల్చదట, అన్యాయం! అందుగ్గాను, రేపావిడ చేసే అరిసెలకు ఏ పాతిక రూపాయలో ముట్ట చెప్పడం న్యాయం. మీరు డబ్బిచ్చే వంకతో రండి, మిగతా పని నేను చూస్తాను," అన్నాడు రంగడు నమ్మకంగా.

కోటిలింగం కాస్త నిరుత్సాహంగానే బయలు దేరాడు. వాళ్ళు సుబ్బమ్మ ఇల్లు చేరేసరికి చీకటి పడబోతున్నది. ఇంట్లో సుబ్బమ్మ ఒక్కతే వున్నది.

"ఇలా వచ్చేరేం, బాబూ? అరిసెలు రేపు చేసి ఇస్తానన్నానుగా!" అన్నది సుబ్బమ్మ, కోటిలింగాన్ని చూస్తూనే.

"ఇంతకాలంగా అరిసెలు చేస్తూ డబ్బు పుచ్చుకోలేదట. ఈ పాతిక రూపాయలూ ఇద్దామని వచ్చాను," అంటూ కోటిలింగం, సుబ్బమ్మకు డబ్బిచ్చాడు.

అంతలో రంగడు, "అన్నట్టు, సుబ్బమ్మా! ఏనాడో ఊళ్ళు పట్టి పోయాడనుకున్న నీ మొగుడు, నాలుగు రోజుల క్రితం పట్నంలోని పెద్ద బజారులో, మా బావమరిదికి కనిపించాడట! మనిషి బాగా ఒళ్ళు చేశాడనీ, ముఖానికి మాంచి నిగారింపు వచ్చిందనీ, మావాడంటున్నాడు!" అన్నాడు.

సుబ్బమ్మ, అల్లుడిముందు, ఇల్లు వదిలిన మొగుడి సంగతి మాట్లాడడం ఇష్టం లేని దానిలా ముఖం పెట్టి, రంగణ్ణి వీధివాకిటికేసి తీసుకుపోయింది.

రంగడు వెళ్ళే ముందు అల్లుడికి సైగ చేశాడు.

అరక్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా, కోటిలింగం వంటింట్లోకి వెళ్ళాడు. అక్కడ కాలి మునివేళ్ళ మీద నిలబడి, జాడీలోంచి చేతికందినన్ని తీసి గబగబా పైపంచలో మూట కట్టాడు. ఇంకా తనలోని ఆశ తీరక జాడీని మళ్ళీ వంచి మరొకటి తీసి ఆత్రంగా కొరికాడు.

అంతే! కోటిలింగం నోరు భగ్గుమనడమే కాక, ఎర్రచీమలు అతడి ముఖాన్నీ, చేతులనూ కుట్టసాగాయి. ఇంతకూ అతడనుకున్నట్టు జాడీలో వున్నవి అరిసెలుకాదు, పశువులకు మేపే తెలకపిండి అచ్చులు!

ఎంత దులిపినా వదలకుండా, ముఖమంతా ఎర్ర చీమలు కుడుతూండగా, కోటిలింగం చిన్నగా మూలుగుతూ ఎవరికంటా పడకుండా పెరట్లోకి పోయి గోడదూకి వీధిలోకి చేరాడు.

అతడి కోసమే ఎదురు చూస్తున్న వాడిలా రంగడు, కోటిలింగాన్ని సమీపించి, "ఏం జరిగింది, చిన్నయ్యగారూ! సుబ్బమ్మకు మాట మాత్రంగానైనా చెప్పకుండా, ఇలా గోడ గెంతి రావడం ఏం మర్యాద అనిపించుకుంటుంది?" అన్నాడు కోప్పడుతున్నట్టు.

కోటిలింగం చిన్నగా, "అంత పెద్దగా మాట్లాడకురా రంగడూ! ఇల్లు చేరాక జరిగిందేమిటో చెబుతాను. అయితే, ఆ రహస్యాన్ని కడుపులోనే దాచుకోవాలి. సరే, ముందు ఈ పది రూపాయలూ వుంచుకో!" అంటూ రంగడికి డబ్బిచ్చాడు.

కోటిలింగం అరగంట తరవాత ఇంటికి వస్తూనే, గౌరమ్మతో, "అత్తా! ఈ మధ్య నాకు నూనె వస్తువులూ, ఆ మాటకొస్తే నేత్తో చేసిన పిండి వంటలు కూడా పడడంలేదు. పొద్దున తిన్న గారెలవల్ల పైత్యం చేసి ముఖం మీద దద్దుర్లు వచ్చాయి. ఇక ఈ జన్మలో అరిసెల మాట తలచనే కూడదని ఒట్టేసుకున్నాను. వచ్చిన మర్నాడే వెళ్ళిపోతున్నామని ఏమీ బాధపడకు. తెల్లవారుతూనే, నేనూ మీ అమ్మాయి బయలుదేరి మా ఊరెళ్ళిపోతున్నాం," అన్నాడు.

అల్లుడిమాటలురంగడితో పాటు గౌరమ్మకు కూడా చాలా సంతోషం కలిగించాయి.






# గొప్పయోగం

చాలాకాలం కిందట ఒకానొక పల్లెటూరిలో కొమరయ్య అనే పశువుల కాపరి ఒకడు ఉండేవాడు. అతడు యువకుడు, మంచి ధైర్యశాలి. ఈ కారణం చేత అతగాడి ఆలోచన ఎప్పుడూ దేశాలు చూడటం మీదా, గొప్ప గొప్ప యుద్ధాల్లో పాల్గొనటం మీదా ఉంటూ వుండేది.

ఒకనాడు కొమరయ్య ఇలాగే ఆలోచిస్తూ పశువులను మేతకు వదిలి ఒక చెట్టుకింద పడుకున్నాడు. కాసేపటికల్లా అతడికి నిద్ర పట్టింది. ఇక ఆ నిద్రలో విచిత్రమైన కల వచ్చింది.

తను ఒక కొండ ఎక్కుతున్నట్టూ, కొండ కొన చేరేసరికి ఒక సింహాసనంలో తను కూర్చున్నట్టూ, అలా సింహాసనంలో కూర్చున్న తన పక్కనే రాణీ వేషంలో వున్న ఒక సుందరి కూడా కనిపించింది. ఇదేమిటా అని ఆశ్చర్య పోతూ అతడు తన తల తడిమి చూసుకునే సరికి నెత్తిమీద ఒక రత్నకిరీటం చేతికి తగిలింది.

"నేను రాజును! రాజును!" అంటూ నిద్ర లోనుంచి కళ్ళు తెరిచి చుట్టూ కలయచూశాడు కొమరయ్య. అంతా వట్టిదే అని అతడికి తెలిసిపోయింది. దూరంగా మేస్తూవున్న పశువులూ, చెట్టుకింద తనూ. "ఎంత మంచి కల వచ్చింది!" అనుకుంటూ ఆలోచనలో పడ్డాడు కొమరయ్య.

ఆ మరుసటి రోజు కూడా అదే కల వచ్చింది. దానితో కొమరయ్యకు కల నిజమవుతుందేమో అనిపించింది. "రేపూ సరీగా ఇలాగే కల వస్తే ఆ కనబడే కొండ ఎక్కుతాను. ఏమో, ఆ కొండ అవతల వున్న బాలాభిపుర రాజ్యానికి నేను రాజును అవుతానేమో!" అనుకున్నాడు కొమరయ్య.

ఆ మూడవ రోజున కూడా కొమరయ్యకు అదే కల వచ్చింది. ఇక ఈ గొడ్లకాపరి పని

లాభం లేదనుకున్నాడు. చెట్టుకింద నుంచి లేచి కొండకేసి బయలుదేరాడు. సాయంత్రా నికి ఎలా అయితేనేం శ్రమపడి కొండపైకి చేరాడు. కాని అక్కడ సింహాసనం లేదు, రాణీ లేదు. అయినా, కొమరయ్య ఎంతమాత్రం నిరుత్సాహపడలేదు. చీకటి పడేసరికి కొండ దిగి తిన్నగా బాలాభిపుర రాజ్యంలో ప్రవేశిం చాడు.

అప్పటికి కొమరయ్యకు బాగా ఆకలి వేసింది. చుట్టుపక్కల ఎక్కడైనా పల్లెగాని, జన సంచారం గాని కంటబడుతుందేమో అని చూశాడు. చీకటీ, కీకారణ్యం తప్ప మరేం కనబడలేదు. సరే, ఈ రాత్రికి ఇక్కడే చెట్ల కింద పడుకుని, తెల్లవారి ఏదైనా గ్రామం చేరుదామనుకున్నాడు.

కొమరయ్య అక్కడ వున్న చెట్టుకింద కాళ్ళు ముడుచుకుని పడుకున్నాడు. ఆకలి దహించుకుపోవటం చేత నిద్ర సరిగా పట్టింది కాదు. అంతలో ఆ పక్కనే గుర్రాల సకిలింపూ నలుగురైదుగురు మనుషులు మాట్లాడుకోవ టంఅతడి చెవిని పడింది.

కొమరయ్య చెవులు రిక్కించి వాళ్ళ మాటలు వినసాగాడు. అక్కడికి కొంచెం దూరంలో చెట్లుచాటున ఒక పాడుబడిన ఇల్లు వుందని వాళ్ళ సంభాషణని బట్టి గ్రహిం చాడు. ఆ అశ్వికులు ఈ రాత్రికి ఆ పాడు పడిన కొంపలో తలదాచుకుందామనుకుంటు న్నారు. కొమరయ్య చెట్టుకింది నుంచి లేచి చడీచప్పుడూ లేకుండా వాళ్లని వెంబడిం చాడు.





కొద్దిసేపటికి వాళ్లు ఆ పాడుపడిన ఇంటికి చేరారు. అందరూ గుర్రాలు దిగి, ఇంట్లో ప్రవేశించి దుప్పట్లు పరుచుకొని పడుకున్నారు. కొమరయ్య, ఏం చేయటమా అని ఆలోచిస్తూ ఆ ఇంటి గోడ పక్కనే చీకట్లో నిలబడ్డాడు. వాళ్ళు దొంగలేమో అన్న భయం కూడా కలిగింది కొమరయ్యకు. కాసేపటికల్లా కొమరయ్య అనుమానించింది నిజమే అని తేలింది. వాళ్ళలో ఒకడు అధికార స్వరంతో ఇలా అడిగాడు:

"ఒరే రాబందూ! ఇవ్వాళ నువ్వు ఏం సంపాదించావు?"

అందుకు బదులుగా ఆ రాబందు పేరు కలవాడు వినయంగా, "అయ్యా, ఇవాళ కలలో కూడా కనపడని గొప్ప వస్తువు ఒకటి సంపాదించాను. వాడెవడో పెద్ద షావుకారులా ఉన్నాడు. వాడిచొక్కా దొంగిలించాను. మనకు ధనం కావాలనుకున్నప్పుడల్లా ఆ చొక్కా జేబులు తిరగవేస్తేసరి, మొహిరీలురాలతై," అన్నాడు.

'భలే' అని మెచ్చుకున్నాడు వాళ్ళ నాయకుడు. తరవాత "అరే గుంటనక్కా! నీ సంపాదన ఏమిటి?" అన్నాడు.

అందుకు గుంటనక్క పేరు గలవాడు. "అయ్యా, ఇవ్వాళ అదృష్టం పండి, ఒక సైన్య నాయకుడు ప్రాణాపాయస్థితిలో నాకంట బడ్డాడు. అతడి ముక్కోణాల శిరోవేష్టం కాజేశాను. అది తలమీద ధరిస్తే— కావాలనుకున్నప్పుడల్లా మూడు దిశల కేసి అంబుల వర్షం కురిపిస్తుంది!" అన్నాడు.

"భలే! నువ్వోయ్ నిజమైన గుంటనక్కవి. సరే, నువ్వోయ్ భల్లూకం! నీ సంపాదన?" అన్నాడు దొంగల నాయకుడు.

"అయ్యా, నేను ఒక కత్తి సంపాదించాను. మనకు కావాలనుకున్నప్పుడు దాన్ని భూమి మీద పొడిస్తే — తడవకు వెయ్యి మంది సైనికులు భూమి నుంచి పుట్టుకొస్తారు!" అన్నాడు భల్లూకం.

"చాలా బావుంది! వాటిని ఆ గోడకు జాగ్రత్తగా తగిలించి ఇక నిద్రపొండి. తెల్లవారి మనకు చాలా పనులున్నాయి," అన్నాడు దొంగల నాయకుడు.

కొమరయ్య వాళ్ళ సంభాషణ విన్నాడు. దొంగలు నిద్రపోగానే, గోడకు తగిలించి వున్న చొక్కా, కత్తీ, శిరోవేష్ఠం మెల్లగా తీసుకుని అక్కడినుంచి చడీ చప్పుడు లేకుండా పారిపోయాడు.

రెండు మూడు రోజులకల్లా బాలాభిపురం చేరి, రాజదర్శనం కోసం అడిగాడు.

"నువ్వెవరివి? రాజదర్శనం అంత తేలిక అనుకున్నావా?" అన్నారు కోట కాపలావాళ్ళు.

"ఓహో అలాగా! ఐతే మీరు నా పేరే వినలేదన్న మాట? మహావీరుడు కొమర సింహుడు తెలియదా?" అన్నాడు కొమరయ్య కళ్ళెర్ర చేస్తూ.

"మీరు... మీరు మహావీరులైన కొమర సింహులా! రండి, దయచేయండి!" అంటూ కాపలావాళ్ళు కొమరయ్యను రాజు దగ్గిరకు తీసుకుపోయారు.

ఆ సమయంలో సింహాసనం పక్కన రాజకుమార్తె కూడా వుంది. ఆమెను చూడగానే కొమరయ్యకు తన కల నిజం అవుతున్నట్టు తోచింది. కిరీటం తప్పితే, ఆమె అచ్చుగా అతడు కలలో చూసిన రాణీలాగే ఉంది.

రాజు, కొమరయ్యను చూసి, "నీకేం కావాలి?" అని అడిగాడు.

కొమరయ్య తన దగ్గిర వున్న శిరోవేష్ఠం, కత్తి సంగతి మాత్రం చెప్పాడు. అనేక యుద్ధాల్లో అరితేరిన వీరుణ్ణి అని తెలియ పరిచాడు.



"కావాలంటే, ఈ ప్రపంచాన్నే జయించి మీకు పట్టాభిషేకం జరపగలను!" అన్నాడు కొమరయ్య ఆఖరికి.

రాజు అతని మాటలు విని పరమానందం పొందాడు.

"సరే, నువ్వు ప్రపంచాన్ని తరవాత జయించవచ్చు, చేతనైతే ముందు నా రాజ్యం మీదికి పెద్ద సేనతో దండెత్తి వచ్చిన గాంధార రాజును ఓడించు!" అన్నాడు రాజు.

"అదెంత పని! కానీ, నా కోరిక ఒకటి వుంది. నేను గాంధార రాజును జయించిన తరవాత, మీ కుమార్తెను నాకిచ్చి వివాహం చేస్తారా?" అని అడిగాడు కొమరయ్య నదురూ బెదురూ లేకుండా.

అందుకు రాజు చిన్నగా నవ్వి, 'సరే' అన్నాడు.

ఆయనకు గాంధార రాజు వల్ల తన రాజరికానికే పెద్ద ముప్పు వచ్చేట్టు కనబడింది. పైగా అంత బలశాలిని జయించినవాడికి తన కుమార్తెను ఇచ్చి వివాహం చేయటం అన్ని విధాలా తనకే గౌరవప్రదం అనుకున్నాడు రాజు.

ఇక కొమరయ్య కొద్దిమంది సైనికులను వెంటబెట్టుకుని వెళ్ళి గాంధార రాజును ఎదిరించాడు. ఘోరయుద్ధం జరిగింది. ఇరు పక్షాలలోనూ చాలామంది సైనికులు మరణించారు.

కొమరయ్య, తనకు సైనికుల అవసరం వున్నదని తోచినప్పుడల్లా కత్తిని భూమిలో గుచ్చి వెయ్యిమంది సైనికులను రప్పించేవాడు. పైగా అతడి శిరోవేష్టం నుంచి వెడలిన బాణాలు శత్రుసైన్యాన్ని చీకాకుపరిచి హతమార్చసాగినై.

సాయంత్రం అయ్యేసరికి చావగా మిగిలిన కొద్దిమంది సైనికులతో గాంధార రాజు పారిపోయాడు. విజయుడైన కొమరయ్య జయ జయధ్వానాలు చేస్తూన్న సైనికులు వెంటరాగా సరాసరి బాలాభిపుర రాజు దగ్గరకు వెళ్ళాడు.

రాజు, కొమరయ్యను అభినందించాడు. "కొమరసింహా! నీకన్న వీరుడైన అల్లుడు నాకు దొరకడు. నేను వృద్ధుణ్ణి అయ్యాను కనుక, ఇప్పుడే నిన్ను బాలాభిపుర రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేస్తున్నాను," అన్నాడు మందహాసం చేస్తూ.

కొమరయ్యకు, రాజకుమార్తెతో వైభవంగా వివాహం జరిగింది. తరవాత రాజ్యాభిషిక్తుడు కూడా అయ్యాడు. సింహాసనం మీద అతడు కూర్చున్నప్పుడు, పక్కనే రాకుమార్తె కిరీటం ధరించి కూర్చున్నది.

"నేను కలలో చూసిన రాణీయే ఈమె!" అనుకొని కొమరయ్య ఎంతగానో మురిసిపోయాడు.

ఇంత గొప్ప వీరుణ్ణి పెళ్ళాడగలిగిన తన అదృష్టానికి రాజకుమార్తె కూడా చాలా సంతోషించింది.



# ప్రకృతి వింతలు

## ఒకానొకప్పటి పక్షులు!

ప్రపంచంలో మొత్తం మీద 9,600 రకాల పక్షులు ఉన్నట్టు ఒక అంచనా. అయితే వాటిలో 6000 రకాల పక్షుల సంఖ్య రోజురోజుకూ తగ్గిపోతున్నది. ఇంకా 1000 రకాల పక్షులు నశించిపోయే స్థితికి చేరుకోవడం విచారకరమైన విషయం. దీనికి కారణం ఏమిటి? ఇంకే ముంది? మన పెరట్లో చెట్టు చేమలుంటేనే కదా పక్షులు వస్తాయి. లేక పోతే ఏంచేస్తా యి పాపం? రోజు రోజుకూ పరిసరాలమీద మనిషి దాడి ఎక్కువవుతున్నది. తన అవసరాలకోసం మనిషి చెట్టుచేమలను నాశనం చేస్తున్నాడు. పర్య వసానంగా పక్షుల సంఖ్యకూడా క్రమక్రమంగా తగ్గి పోతున్నది. ఉదాహరణకు, యూరపుకు చెందిన తెల్ల కొంగనూ, ఉత్తర అమెరికాకు చెందిన పసుపు ముక్కు కోకిలనూ ఇప్పుడు ఒకానొకప్పటి పక్షులుగానే చెప్ప వలసి ఉన్నది!



## పొదగడంలో నేర్పరి!

చలిగా వుంటే మనం దుప్పటి కప్పుకుంటాం; చలిమంట వేసుకుంటాం; ఎండలో నిలబడతాం; ఎలక్ట్రిక్ రూమ్ -- హీటర్ ఉపయోగిస్తాం. మరి బట్ట బయలులో వుండే పక్షులెలా చలికి తట్టుకో గలుగు తున్నాయి? ముఖ్యంగా గుడ్లు పొదగడానికి కావలసిన వెచ్చదనాన్ని అవి ఎలా సమకూర్చుకుంటాయి? వీటికి ప్రకృతిసిద్ధంగానే ఆ శక్తి ఉన్నది. ఉదాహరణకు, పొదగడంలో నేర్పరి అయిన 'మల్లీ ఫౌల్'ను తీసుకో వచ్చు. ఇది ఆస్ట్రేలియాకు చెందిన పక్షి. ఆడ పక్షి గుడ్లు పెట్టే సమయానికి, మగ పక్షి 1 మీ॥ లోతు 3 మీ॥ వెడల్పుగల పల్లం తవ్వి, ఆకులు అలములతో నింపుతుంది. అవి మగ్గడం ప్రారంభం కాగానే వెచ్చ దనం పుట్టుకొ స్తుంది. అప్పుడు మగ పక్షి అక్కడ ముక్కుతో రం ధ్రం చేస్తుంది. ఆడపక్షి అం దులో క్రమంగా వారానికొక గుడ్డు ప్రకారం ఆరు నెలల పాటు పెడుతుంది. పొదగడానికి కావలసిన వెచ్చదనం ఉన్నదా? లేదా? అని మగపక్షి ముక్కుతో పొడిచి గమనిస్తూ, అవసరానికి తగినట్టు ఇసుకను నింపడం గాని, తీసివేయడంగాని చేస్తుంది. ఆ తర వాత గుడ్లలోనుంచి వారానికొక పిల్ల పగిలి బయటకు వస్తుంది.



## ఇండియాలో రాక్షస బల్లులు!

మన దేశంలో కూడా డినోజార్స్ అనబడే రాక్షస బల్లులు తిరిగేవని నమ్మవలసి ఉన్నది. గుజరాత్‌లోని ఖేరా జిల్లాలో శిలాజాలుగా మారిన 1,000 గుడ్లు గత పదేళ్ళలో బయటపడ్డాయి. 11 సెం. మీ. ఎత్తు, 7 సెం.మీ. వెడల్పుగల ఈ గుడ్లు శిలాజాలుగా మార డంవల్ల చాలా బరువుగా ఉన్నాయి. ఇవి డినోజార్స్ గుడ్లు కావచ్చునని భావి స్తున్నారు. పంజాబు విశ్వ విద్యాలయానికి చెందిన పరిశోధకులు ఈ గుడ్లు 65,000,000 సంవత్స రాల నాటివై ఉండవచ్చని అభిప్రాయపడుతున్నారు!



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!






SUPER
RUBBER








THE

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 జూన్ నెల సంచికలో ప్రకటింపబడును.



G. Srinivasa Murthy



Purushottam Vagga

✷పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ✷ ఏప్రిల్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ✷మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ✷వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : **నిజం, గజం ఘీంకారం!**

రెండవ ఫోటో : **నీడలలో, ఆకారం!**

పంపినవారు : శ్రీకారం భానుమూర్తి

సి.సి.యల్-ఎన్.ఎమ్.సి., ఛికోద్రా, కొసింద్రా పోస్టు, బరోడా జిల్లా - 391 140 (గుజరాత్)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతిప్రియమైన కానుక

# చందమామ



వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి:

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి!

సంవత్సర చందా:

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా: రూ. 105.00 ఎయిర్ మెయిల్ ద్వారా: రూ. 252.00

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా: రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా: 252.00

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి:

సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026




ఇంకొక ఇంటిలోకి

మేము మారినప్పుడు...

ఆ బిల్డింగ్‌లో పిల్లలందరూ
ఎంతో హాయిగా ఆడుకుంటూ
వున్నారు. నా గురించి ఎవరూ
పట్టించుకోలేదు. ఎలా వీళ్ళని ఫ్రెండ్స్
చేసుకోవడం.. మ్.. ఆ..

ఐడియా వచ్చేసింది ! ఒక ట్రై-మీ
నోట్లో వేసుకున్నాను ! టక్ టక్ అని తిన్నగా
వెళ్ళి వాళ్ళకి యిచ్చాను బోల్డన్ని. "మ్ రండి -
ట్రైమీ !" అంతే ! ఒకే రోజులో అయిదుగురు
నా ఫ్రెండ్స్ అయిపోయారు







Try-Me!

సవాలు చేసే కొత్తరుచి

HTA-8507